







# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి...
# రోజంతా దంతక్షయాన్ని నివారించండి!




కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొంటే ఎక్కువ దంతక్షయమును, ఎక్కువ మందికి అరికట్టిన దని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎప్పుడూ ప్రకటించబడనట్లు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటె: కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒకసారి పళ్లు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. కాల్గేట్‌కు మాత్రమే యీ ఋజావు ఉన్నది! ఎంత చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో రోజూ పళ్లు తోముకొనుటకు పిల్లలు ఇష్టపడతారు!

COLGATE
DENTAL CREAM

శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్లకు...ఎక్కువమంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్ట్ కంటె కాల్గేట్‌నే కొంటారు!

DC.G.41 TL




# మాధుర్య జీవితానికి క్యాడ్‌బరిస్!

## Cadbury's

విశిష్టమైన మరియు మీగడ పాల చాక్‌లెట్ అంటే క్యాడ్‌బరిస్...
ఇది ఆనందాన్ని కలుగజేస్తుంది. ఆరు విధములయిన
రుచులతో కూడిన ఆనందాన్ని మీరు
క్యాడ్‌బరిస్‌తో పొందగలుగుతారు.

ప్రతి చాక్‌లెట్ పాలమొక్క



గుణములు గలిగినది!

AIYARS-C2 TL

# చూడండి, మీకే తెలుస్తుంది...
# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్ !

ఫలితములను చూడండి. బట్టలను ఆఖరు సారి జాడించునపుడు కొంచెము టినోపాల్ వేయండి అప్పుడు చూడండి. బట్టలు ఎంత తెల్లగా, కళ్లు మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు, చీరలు, దుప్పట్లు, తువాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి!

దానికయ్యే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడ కాదు! టినోపాల్‌ను కొనండి. రెగ్యులర్ ప్యాక్, మితవ్యయ ప్యాక్ మరియు బాల్టీకి సరిపోయే పొట్లము—మూడు ప్యాకింగులలో లభిస్తోంది.







® టినోపాల్ జె.ఆర్. గైగి ఎస్.ఎ. బాల్
స్విట్జర్లెండ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహృద్ గైగి లిమిటెడ్, పి.ఒ. బాక్స్ 11050, బొంబాయి 20 బి.ఆర్.

Shilpi SGT-1A/69 Tel

దేశస్వాతంత్ర్యాన్ని రక్షిస్తున్న
వీర పుత్రులకు అభినందన!

స్వాతంత్ర్యం విలువను విస్మరిస్తున్న
స్వార్థపరులకు అభిశంసన!



అన్నపూర్ణా పిక్చర్సు

# జై జవాన్



దర్శకత్వం: డి. యోగానంద్
నిర్మాత: దుక్కిపాటి మధుసూదనరావు, బి.ఎ.

నవయుగ

బ్రిటానియా
# బ్రిటా
బిస్కట్లు




బ్రిటానియా
అంటే నాణ్యత

తియ్యగా గరగరలాడే చిన్న చిన్న బ్రిటానియా బ్రిటా బిస్కట్లంటే పిల్లలంతా చాలా యిష్టపడ్తారు. వారికి దోసెటితో యివ్వండి. జేబులనిండా యివ్వండి. గంటలకొద్దీ వారిని సంతోషంగా ఆడుకోనివ్వండి.

BBC-8883



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

దాతలందరూ ఒక రకంగా ఉండరు. కొందరు పుణ్యం కోరి దానాలు చేస్తారు. మరికొందరు కీర్తి కోసం దానాలు చేస్తారు. భూతదయ కలిగి కొందరు దానాలు చేస్తారు. మరికొందరు దానం చెయ్యటంలో కూడా అహంకారం ప్రదర్శిస్తారు. "స్వేచ్ఛాజీవి" అన్న కథలో ఈ చివరిరకం దాత మనకు కనిపిస్తాడు. అలాటివాడి వద్ద దానం గ్రహించని వాడిదే స్వేచ్ఛ! అలాటి స్వేచ్ఛాజీవికి ఆశాభంగం అంటూ ఉండదు. ఒకప్పుడు లాభం కూడా కలగవచ్చు.

సంపుటి 46 ఫిబ్రవరి '70 సంచిక 2

CHITRA



# స్వేచ్ఛా జీవి

ఒక దేశంలోని ఒక గ్రామంలో ఇద్దరు అభాగ్యు లుండేవారు. వారిద్దరూ జీవితంలో పెద్దగా దెబ్బ తిన్నారు. వారికి ఇతరుల నుంచి సహాయం ఏమీ లభించలేదు. అందుచేత వాళ్ళు పొరుగుదేశం పోయి, ఆ దేశాన్ని ఏలే మహేంద్రవర్మ నుంచి తమకు కావలసిన సహాయం పొంది, మిగిలిన జీవితం సుఖంగా గడుపుదామని నిశ్చయించుకుని, ప్రయాణమయారు.

దారిలో వారికి మరొక మనిషి తగిలాడు. ఆ మనిషి కూడా గొప్ప స్థితిలో లేనప్పటికీ, నిర్విచారంగా ఉన్నట్టు కనబడ్డాడు. అతనిలో ఏదో సంతృప్తి కూడా ఉన్నది.

"మీ ప్రయాణం ఎక్కడిదాకా?" అని మూడోవాడు మిగిలిన వాళ్ళను అడిగాడు.

"మా ఇద్దరి జీవితాలూ చితికిపోయాయి. విధి మా పట్ల చిన్న చూపు చూసింది. అందుచేత మేము మహేంద్రవర్మ మహారాజు వద్ద సహాయం పొంది, మళ్ళీ సుఖజీవనం గడుపుదామనుకుంటున్నాం. ఆయన మహాదాత. ఎవరేది కోరినా ఇస్తాడు. మా కోరికలు తీర్చటం ఆయనకొక లెక్కలోది కాదు," అన్నారు వాళ్ళు.

వాళ్లు తన ప్రయాణం గురించి అడిగితే మూడోవాడు, "నాకూ ఇల్లూ వాకిలీ లేవు. నేనూ పేదవాణ్ణే. అయితే నేనెవరిని ఏదీ యాచించను. నన్ను భగవంతుడు కనిపెట్టే ఉంటాడు. నా అర్హత కూడా ఆయనకు తెలుసు. భగవంతుడు ఇవ్వనిదీ, ఇవ్వలేనిదీ మానవమాత్రులిస్తారా? నేను నమ్మను. అందుచేత నా భారం ఆ దేవుడికే వదిలి, నిర్విచారంగా దేశసంచారం చేస్తున్నాను," అన్నాడు.

కాలక్రమాన ముగ్గురూ మహేంద్రవర్మ ఏలే నగరం చేరి, ఆ రాత్రికి ఒక పాడుపడిన ఇంట బస చేశారు. ఆ రాత్రి చాలా

పి. ఉమామహేశ్వరరావు

పొద్దుపోయిన దాకా అదీ ఇదీ మాట్లాడు కుంటూండగా వాళ్లుంటున్న ఇంటి కేసి మహేంద్రవర్మే స్వయంగా మారువేషంలో తిరుగుతూ వచ్చాడు. ఇంటిలో జరుగుతున్న సంభాషణ ఆయన చెవిన పడింది.

మహేంద్రవర్మ ఆ ఇంటిని గుర్తుంచు కుని, మర్నాడు తన సభకు ఆ ముగ్గురు మనుషులనూ పిలిపించి, వేరువేరుగా ఒక్కొక్కరినీ, "నువు పరదేశీయుడి లాగా కనిపిస్తున్నావు. నీ కోరిక ఏమిటి?" అని అడిగాడు.

"మహారాజా, మేము ఒకప్పుడు ఘనంగా బతికినవాళ్ళం. ఎంతో సంపద ఉండి కూడా అంతా హరించిపోయింది. ఆస్తి ఉండగానే నాకు జ్ఞానోదయం కలిగి నట్టయితే ఏ వర్తకమో చేసుకుని సుఖంగా జీవించి ఉండేవాణ్ణి. ఇప్పుడైనా తమ వంటి దాతలు పదివేల బంగారు కాసులు దానం ఇచ్చినట్టయితే, తిరిగి ఘనంగా బతక గలుగుతాను," అన్నాడు ఒకడు.

రెండోవాడు ఇలా అన్నాడు: "మహా రాజా, కొంతకాలం క్రితం నేను రంభ లాంటి కన్యను పెళ్లాడి, ఆమెతో కొంతకాలం స్వర్గ సుఖాలు అనుభవించి. నా అంత అదృష్ట వంతుడు ప్రపంచంలో మరొకడు లేడను కున్నాను. అకస్మాత్తుగా నా భార్య



పోయింది. వెంటనే నాకు మతిపోయిన ట్టయింది. ఉన్న ఊరినీ, అయిన వాళ్ళనూ విడిచిపెట్టి, దేశసంచారం మొదలుపెట్టాను. నేను తిరిగి మామూలుగా జీవించాలంటే నా మొదటి భార్యను మరిపించే అందగత్తె అయిన కన్య లభ్యం కావాలి. తమరు నా కొక చక్కని కన్యను దానం చేశారంటే సుఖంగా జీవించగలుగుతాను."

మహేంద్రవర్మ మూడోవాడి కేసి తిరిగి, "నీ కోరిక ఏమిటి?" అని అడిగాడు.

"మహారాజా, కోరికలు ప్రతి మనిషికీ ఉంటాయి. వాటిని తీర్చాలో, తీర్చరాదో నిర్ణయించేది మనుషులు కాదు, ఈశ్వరుడు. నేను స్వతంత్రుణ్ణి; ఎవరినీ ఏదీ యాచించను. ఎవరికీ రుణపడి ఉండను," అన్నాడు.

మహేంద్రవర్మకు ఈ మాటలు విని చాలా ఆగ్రహం వచ్చింది. ఆయన దానాలకు ప్రసిద్ధి పొందినవాడు. ఎక్కడెక్కడివాళ్ళూ వచ్చి తన వద్ద దానాలు పుచ్చుకుంటూంటే, ఇలాటి దౌర్భాగ్యుడు తాను ఇస్తానన్నా వద్దనటం ఆయన సహించలేక పోయాడు. ఆయన మొదటి వాడికి రెండు సంచుల నిండా బంగారమూ, రెండోవాడికి ఒక సౌందర్యవతి అయిన కన్యనూ ఇచ్చి, "ఇక మీరు ముగ్గురూ వచ్చిన దారినే వెళ్ళిపొండి," అన్నాడు.



ముగ్గురూ వెంటనే ప్రయాణమై వెళ్ళి పోయారు.

మహేంద్రవర్మ సభ చాలించి, ఒక భటుణ్ణి పిలిచి, "ముగ్గురు ప్రయాణీకులు మన రాజ్యం విడిచి పోతున్నారు. నువు గుర్రం మీద వెళ్ళి వారిని కలుసుకో. ఒకడి వద్ద రెండు సంచులున్నాయి. మరొకడి వెంట ఒక ఆడది ఉంటుంది. వారిద్దరినీ వదిలేసి, ఒంటరిగా వెళ్ళే మూడోవాడి తల నరికి పట్టుకురా!" అని అజ్ఞాపించాడు.

ఈ లోపల, రాజు దగ్గిర బంగారం పుచ్చుకున్నవాడు, సంచులు బరువనిపించి, కొంచెం సేపు పట్టుకోమని మూడోవాడికిచ్చాడు. ఆ సమయంలో రాజభటుడు గుర్రం మీద వచ్చి, వాడి వద్ద ఏమీ లేక పోవటం చూసి, వాడి తల నరికి తీసుకు పోయి రాజుకు చూపాడు.

మహేంద్రవర్మ ఆ తల చూసి, నిర్ఘాంత పోయి, "నేను నరకమన్నది వీడి తల కాదు. పొరపాటు చేశావు. మళ్ళీ వెళ్ళి, ఆడది వెంట ఉన్నవాణ్ణి వదిలేసి, రెండో వాడి తల నరుక్కురా," అని భటుణ్ణి మళ్ళీ పంపాడు.

వాడు వచ్చే లోపల కన్యాదానం పుచ్చుకున్నవాడు శంక తీర్చుకోవటానికి దారిలో ఆగి పోయాడు. వాడి వెంట ఉన్న కన్య మూడో వాడితో బాటు ముందుకు నడిచి వెళ్ళింది. కొంతసేపయాక వెనక పడిన వాడు తిరిగి నడక సాగించాడు. ఆ సమయంలో, రాజు పంపిన భటుడు వచ్చి, ఒంటరిగా నడుస్తున్న రెండోవాడి తల నరికి తీసుకుపోయి రాజుకు చూపాడు.

తన రెండో ప్రయత్నం కూడా విఫలమయింది. తన మీద ఆధారపడిన ఇద్దరూ తన మూలంగానే చచ్చారు. స్వతంత్రుణ్ణని చెప్పుకున్న వాడికి ధనమూ, కన్యా కూడా దొరికాయి! ఈ సంగతి గ్రహించి మహేంద్రవర్మ తన అహంకారానికి పశ్చాత్తాప పడ్డాడు.





# బంగారు పంట

జావాద్వీపంలో డోంగో అనే పేద కుర్రవాడు ఉండేవాడు. వాడు బొత్తిగా దిక్కులేనివాడు. వాడు ఒక వితంతువు వద్ద కమతం చేస్తూ, ఆమె పొలంలో పని చేసేవాడు. వాడు చేసే పొలం చాలా సారవంతమైనది. అయినప్పటికీ డోంగో సాగుచేసిన ఏడు ధాన్యమంతా తప్పవేసి పోయింది. పైరు ఏపుగా పెరిగింది, కంకులు బాగా వేశాయి, కాని నూర్చితే అంతా తాలు కిందనే పోయింది. గింజ రాలలేదు.

మొదటి ఏడు అయినట్టే రెండో ఏడు కూడా జరిగేసరికి, గ్రామంలోవాళ్ళు గుసగుసలు ప్రారంభించారు. ఆ వితంతువు పిసినిగొట్టు అనీ, ఆమె గ్రామదేవతకు కూడా సరిగా నైవేద్యం పెట్టదనీ, అందుకే పంట నాశన మవుతున్నదనీ వాళ్ళు చెప్పుకోవటం విని, ఆమెకు కోపం వచ్చి, డోంగోను పనిలో నుంచి వెళ్ళగొట్టింది. వెళ్ళేటప్పుడామె వాడి చేత చిల్లిగవ్వ కూడా పెట్టలేదు.

డోంగో ఆకలితో అలమటిస్తూ ఆ గ్రామం విడిచి బయలుదేరాడు. ఒకనాటి సాయంకాలం అతను మరొక గ్రామం చేరి ఊరి బయట ఉన్న ఒక ఇంటి తలుపు తట్టాడు. ఆ ఇంట్లో వున్న వితంతువు వచ్చి తలుపు తెరిచింది. తలుపును ఆనుకుని ఉన్న డోంగో కుప్పకూలిపోయి, హీనస్వరంతో, "ఒక్క ముద్ద పెట్టండి. ప్రాణం పోతున్నది," అన్నాడు.

ఆ వితంతువు వెంటనే ఆ కుర్రవాణ్ణి లోపలికి నడిపించుకు పోయి, అన్నం పెట్టి, "కన్నూ, కాలూ ఉన్నవాడివి గదా! నీకు ముష్టి ఎత్తుకునే గతి ఎందుకు పట్టింది? పని చేసుకోవచ్చునే!" అన్నది.

డోంగో తన కథంతా చెప్పి, "కష్టపడి పనిచేశాను. మరొకడైనా అంతకన్న చెయ్యా

జావా జానపద కథ

లేదు. కంకుల్లో గింజ పడకపోతే అది నా తప్పా? పొలం గలావిడ చేసుకున్న పుణ్యం ఎటువంటిదో!" అన్నాడు.

"నీ తప్పేమీ లేదు మరి. నువు పొలం పని చేస్తానంటే మాకు కాస్త పొలం ఉన్నది. అందులో పనిచెయ్యి. రాబడిలో అయిదోవంతు నువు తీసుకో. మాకు దున్నలు లేవు. అయితే పొలం చాలా చిన్నది." అన్నాదా వితంతువు

"ఫరవాలేదు. నా శక్తి కొద్దీ పనిచేస్తాను," అన్నాడు డోంగో.

మర్నాడు ఉదయమే అతను పార తీసుకుని పొలానికి వెళ్ళాడు. పారతోనే పొలమంతా తవ్వి, నాగలితో దున్నినంత బాగా తయారుచేశాడు. తరుణంలో నాట్లు తానే వేశాడు. పైరు ఎదిగి వచ్చింది. చక్కని కంకులు వేసి, బంగారం రంగుకు తిరిగాయి.

కోతల తరుణం సమీపిస్తూండగా డోంగోకు మిన్ను విరిగి మీద పడినట్టయింది. అతను కంకులను నొక్కి చూస్తే అన్నీ తప్పగింజలే! వాటిలో బియ్యపు గింజలు లేవు

"ఇదంతా నా దురదృష్టమే కావాలి. నన్ను పనికి పెట్టుకున్న వాళ్ళ గతి ఇంతే," అనుకుని డోంగో హతాశుడై పోయాడు. జరిగిన సంగతి తన యజమానురాలికి చెప్పే



ధైర్యం అతనికి లేకపోయింది. కోతలు కోశాక ఆవిడకు తెలియనే తెలుస్తుంది.

మర్నాడు కోతలనగా డోంగో పారిపోవటానికి నిశ్చయించుకున్నాడు. అతను తెల్లవారక ముందే లేచి, చప్పుడు చెయ్యకుండా ఇంటి నుంచి బయలుదేరాడు. తాను శ్రమపడి పెంచిన పైరును మరొక్కసారి చూసుకుని మరీ వెళ్ళిపోవాలనిపించింది. పొలాన్ని చేరుకుని ఒక కంకి కోసి వడ్లగింజలను నలిచాడు. లోపల బియ్యపుగింజలు లేవు– కాని లోపల సన్నని బంగారపు గింజలాటిది ఉన్నది.

డోంగో తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఎన్ని వడ్లగింజలు నలిస్తే అన్నిటిలోనూ బంగారపు గింజలున్నాయి. అవి నిజంగా బంగారపు గింజలే! అతను పరిగెత్తుకుంటూ ఇంటికి తిరిగి వెళ్ళి, తన యజమానురాలికి బంగారు గింజలు చూపించబోయాడు.

"ఏమిట్రా అదీ? అంత ఉత్సాహంగా వున్నావు!" అన్నదామె.

"మన పొలంలో బంగారం పండిందమ్మా! ఇదుగో బంగారం!" అంటూ అతను ఆమెకు బంగారం గింజలు చూపాడు.

అందులో అబద్ధం ఏమి లేదు. చేను కోసి కంకులు నలిస్తే ఇంత పెద్ద బంగారు గింజల రాసి పడింది. యజమానురాలు వాడికి అందులో అయిదో వంతు ఇచ్చి, తాను అన్న మాట నిలబెట్టుకున్నది. ఆమె గ్రామంలో వారందరికీ పెద్ద విందు చేసింది.

డోంగో తన వంతుతో పొలాలు కొన్నాడు. తన యజమానురాలు కొన్న పొలాల సాగూ, తన పొలాల సాగూ కూడా అతనే చూశాడు. ఆ పొలాలలో పనిచేసిన వారందరికి ఫలసాయంలో అయిదోవంతు ఇస్తూ వచ్చాడు. అదిమొదలు జావాలో పొలం పనివారికి పంటలో అయిదో వంతు ఇవ్వటం ఆనవాయితీ అయింది.





# శిథిలాలయం

## 26

[శిథిలాలయ పూజారి, ఐభ్యులను మోసపుచ్చి ఒక బిలమార్గం ద్వారా పారిపోయాడు. ఐభ్యకులపెద్ద, తన దళనాయకుడైన నాంగ్‌సోమ్‌ను శిథిలాలయం వున్న వృశ్చిక లంకకు దారి చూపేందుకు శిఖిముఖీ వాళ్ళతో పంపటానికి ఒప్పుకున్నాడు. రెండు పెద్ద పడవలు సిద్ధం చేయబడినై. అందరూ వృశ్చికలంకకు ప్రయాణమయారు. తరవాత—]

సూర్యాస్తమయం వరకూ శిఖిముఖీ వాళ్ళు ప్రయాణం చేసి, ఆ రాత్రికి విడిది చేసేందుకు అనుకూలంగా వుండే లంక కోసం ప్రయత్నించారు. పావుగంట ప్రయాణ దూరంలో వాళ్ళకో లంక కనబడింది. చీకటి పడుతుండగా వాళ్ళా లంక చేరి, పడవలను ఒడ్డునున్న చెట్లకు కట్టి, వంట పనులు ప్రారంభించారు. తాము చేసిన మంట నుంచి వెలువడుతున్న పొగను గుర్తించి, మూడవ పడవవాళ్ళు కూడా కొంచెం ఆలశ్యంగా అక్కడికి రాగలరని వాళ్ళు భావించారు.

క్రమంగా చీకటి కమ్ముకున్నది. వంట పూర్తి కాగానే అందరూ భోజనాలు చేసి, నెగడొకటి వెలిగించి, దాని చుట్టూ కూచుని పిచ్చాపాటీ మాట్లాడుకోసాగారు. మూడవ పడవ యింకా ఆ లంక చేరలేదు. శిఖిముఖికి, శిథిలాలయ పూజారి తమ కన్న




ముందుగా వృశ్చికలంకకు ప్రయాణం కట్టాడని గట్టి నమ్మకం కలిగింది. ఒకవేళ తమ పడవలూ, వాడున్న పడవా ఎక్కడో మార్గమధ్యాన తారసపడితే, పోరు తప్పదు. అప్పుడు తమలో కొందరైనా జలజంతువులకు ఆహారం అయిపోతారు....

ఇలా ఆలోచిస్తున్న శిఖిముఖికి లంకమీది చెట్లలో నీటిపక్షులు చేసే కలకలంతో పాటు, తీరం వెంట నీటిలో మొసళ్ళూ యితర నీటిజంతువులూ చేసే ధ్వనులు కూడా వినిపిస్తున్నవి. అతడు విక్రమకేసరితో, "ఈ చీకట్లో, యీ లంకా, చుట్టూ వాతావరణం ఎంత భయంకరంగా వున్నదో



చూశావా? దీనికన్న క్రూరమృగాల నడుమ మహారణ్యంలో కాలంగడపటం వేయింతలు సుఖంగా వుంటుంది," అన్నాడు.

నాంగ్‌సోమ్ అవునన్నట్టు తల వూపాడు. విక్రమకేసరి, "నువ్వీ లంకను గురించి ఆలోచిస్తున్నావా? నాకు పూజారి గుర్తు కొస్తున్నాడు. వాడీ లంకలోనే మరో ప్రాంతాన బస చేశాడేమో అన్న అనుమానం నాకు కలుగుతున్నది," అన్నాడు.

ఆ మాటలకు శిఖిముఖి నవ్వి, పక్కనున్న ఎండుకట్టెలు నెగడులో వేయసాగాడు. ఉన్నట్టుండి హఠాత్తుగా లంకలో ఒకమూల నుంచి గుండెలవిసే లాంటి కేక ఒకటి వినిపించింది. ఎర్రగండు అటుకేసి తిరిగి మొరగసాగింది. శిఖిముఖి చప్పున లేచి నిలబడి, "అది మనిషి గొంతా, లేక ఏదైనా వింతమృగానిదా?" అన్నాడు.

"ఎవరో మనిషి ప్రమాదంలో చిక్కుకున్నాడు, లేక మనను ప్రమాదంలో చిక్కించేందుకు శిథిలాలయ పూజారి ఎత్తు వేస్తూండవచ్చు. ఆయుధాలు సిద్ధంగా పట్టుకుని బయలుదేరండి," అన్నాడు విక్రమకేసరి.

అజితవీరభద్రులు చప్పున రెండు కాగడాలు వెలిగించి ముందు బయలుదేరారు.







ఈ సారి ఎవడో మనిషి అరుస్తున్నట్టుగా స్పష్టంగా కేకలు వినిపించినై. అందరూ అక్కడికి పరిగెత్తే సరికి, కుంటికాలువాడు ఒకడు అటూ యిటూ గెంతుతూ, చేతిలో వున్న దుడ్డుకర్ర సాయంతో, తన మీదికి ఉరుకుతున్న రెండు మొసళ్లతో పోరాడుతున్నాడు.

శిఖిముఖి ఆ కుంటివాడి రక్షణకు ముందుకురికే లోపలే ఎర్రగండు భయంకరంగా మొరిగి వాడి మీదికి లంఘించింది. కుక్క అరుపు వింటూనే కుంటివాడు వణికిపోతూ, "శిఖిదొరా! నన్ను ముందు మొసళ్ళ నుంచి కాదు, ఈ ఎర్రగండు నుంచి కాపాడండి! తరవాత మీ యిష్టం వచ్చిన శిక్ష విధించండి!" అన్నాడు.

ఆ కంఠస్వరం విని అందరూ ఆ కుంటివాడు తమకు ద్రోహంచేసి పారిపోయిన జాంగ్‌లా అని గుర్తించారు. ఎంత దుర్మార్గుడయినా చిత్రహింసలకు గురిచేయటం మానవత్వం అనిపించుకోదు గనక, శిఖిముఖి ముందుగా ఎర్రగండును దగ్గిరకు పిలిచి, తనచేతి కత్తితో ఒక మొసలిని తల మీద గట్టిగా కొట్టాడు. ఇంతలో అజితుడు ఈటెతో రెండవ మొసలిని నడుం మీద పొడిచాడు.



మొసళ్ళు రెండూ తాము తిన్న దెబ్బలకన్నా కాగడాల వెలుగుకు ఎక్కువగా భయపడిపోయి దాపులనున్న నీటి కేసి చరచరా పాకి, దభీమంటూ అందులో పడినై. జాంగ్‌లా ఆయాసపడుతూ నేల మీద కూలబడ్డాడు. అతడేదో చెప్పాలని చూశాడుగాని, నోట మాట పెగలలేదు.

శిఖిముఖీ అతడి మిత్రులూ హఠాత్తుగా ఎదురైన యీ వింత సంఘటనకు ఆశ్చర్యపడ్డారు. జాంగ్‌లా యీ రాత్రివేళ యీ లంకకు ఎలా చేరాడో వాళ్ళు ఊహించలేకపోయారు. శిథిలాలయ పూజారి తమ మీద వేగుచేసేందుకు జాంగ్‌లాను తాము దిగిన





చోటుకు పంపాడేమో అన్న అనుమానం మాత్రం విక్రమకేసరికి కలిగింది.

శిఖిముఖి, జాంగ్‌లాను ఏదో ప్రశ్నించబోయేంతలో విక్రమకేసరి కత్తి ఎత్తి, "జాంగ్‌లా! నిజం చెప్పు. అబద్ధం ఆడావో రెండో కాలు కూడా నరికి ప్రాణం వుండగానే నిన్ను మొసళ్ళ దగ్గిరకు తోయించుతాను. నీ యజమాని ఆ పూజారిగాడు, యీ లంకలో ఏ మూల దిగాడు?" అని ప్రశ్నించాడు.

జాంగ్‌లా ఆ ప్రశ్నకు భయపడినట్టు లేదు. అతడు బతుకుమీద రోసినవాడిలా ఒక నిట్టూర్పు విడిచి, "కేసరిదొరా! నేను



మీకు చేసిన ద్రోహానికి, యిప్పుడు నేనెంత నిజం చెప్పినా నమ్మరు. నాకు మీ యిష్టం వచ్చిన శిక్ష విధించండి," అన్నాడు.

"ఈ దొంగ నాటకం నా దగ్గిర సాగదు. నిజం చెపుతావా, లేదా?" అంటూ విక్రమకేసరి కత్తిని జాంగ్‌లా మెడమీద పెట్టాడు.

శిఖిముఖి నవ్వుతూ, "కేసరీ! అప్పుడే నీ ప్రతిజ్ఞమాట మరిచిపోయి వాడి తల నరకబోతున్నావు. ప్రాణాలతో గదా వాణ్ణి మొసళ్ళకు వేస్తానని నీ వింతకు ముందు అన్నది? కొంచెం ఆగు....జాంగ్‌లా! ఇప్పటి నీ పరిస్థితి చూస్తూంటే నువ్వు సుఖమైన చావుకోసం ఎదురుచూస్తున్నట్టు కనబడుతున్నావు. కాని నిజం చెప్పకపోతే కేసరి నిన్ను ప్రాణాలతోనే మొసళ్ళకు వేసి భయంకరమైన చావుకు నిన్ను గురిచేస్తాడు. తెలిసిందా?" అన్నాడు.

జాంగ్‌లా ఓ క్షణకాలం మౌనంగా వూరుకుని, "శిఖిదొరా! ద్రోహి చచ్చేముందు నిజం పలికినా, అబద్ధం మాట్లాడినా ఒకటే. కాని, చావుకు ముందు నేను చెప్పే నిజం మీకు కొంత ఉపకరిస్తుంది. పూజారి యీ రోజు మధ్యాన్నం ప్రాంతాలే రెండు పడవల్లో శిథిలాలయం వున్న లంక కేసి పోయాడు. మీ రా లంక చేరే సమయానికి వాడు





మీ కోసం మాటువేసి వుంటాడు. తగు జాగ్రత్తలో వుండండి," అన్నాడు.

జాంగ్‌లా మాటల్లో మోసం లేదన్న నమ్మకం శిఖిముఖికి కలిగింది. "అయితే, జాంగ్‌లా! నువ్వు నీ యజమానితో వెళ్ళక యీ మొసళ్ళ లంక మీద ఎందుకు దిగబడిపోయావు?" అని ప్రశ్నించాడు.

"చచ్చేముందైనా నిజం చెప్పి చావ దలిచాను, దొరా! వినండి. నేను మీకు తలపెట్టిన ద్రోహంవల్లే చిరుతపులికి చిక్కి అవిటివాణ్ణయిపోయాను. నా పాపమే నన్ను తిచింది. కామాఖ్యనగరంలో గౌరవంగా బతికే నన్ను, డబ్బాశ చూపి దుర్మార్గుణ్ణిగా చేసినవాడు పూజారి! వాణ్ణి సమయం వచ్చినప్పుడు హతమార్చ దలిచాను. కాని, వాడు నీచగ్రహోపాసకుడు! నా ఆలోచనలు పసిగట్టాడో ఏమో నన్ను, ఏదో భయంకరమైన జలజంతువుకు ఆహారంగావేసి పోజూశాడు," అన్నాడు జాంగ్‌లా.

"నిన్ను జలజంతువుకు ఆహారంగా వేశాడా! అదెలా జరిగింది?" అన్నాడు శిఖిముఖి ఆశ్చర్యపడుతూ.

జాంగ్‌లా యిలా చెప్పాడు:

"గోల్‌ఖరా గ్రామప్రాంతంలోని నది దగ్గిర్నుంచి, యీ జలప్రదేశానికి వాడి పడ




వలు సాగినప్పటి నుంచీ, నేను చుట్టు పక్కల వున్న అన్ని లంకల్నీ పరిశీలించి చూస్తూ, ఒక్కొక్కదాన్నే గుర్తు పెట్టుకో సాగాను. నేను గజయీతగాణ్ణి. ఆ పూజార్ని వాడి ముఠాతో ఏదో ఒకచోట పడవలతో పాటు నీట ముంచి, ఏ తెప్పకొయ్య మీదో తిరిగి గోల్‌ఖరా చేరాలన్నది నా పథకం.

"వాడు నా ఆలోచనలు గ్రహించినట్టున్నాడు. ఈ మధ్యాహ్నం పడవలు, యీ లంకపక్క నుంచి పోతూండగా, వాడు పడవ మీంచి నీట్లోకి తొంగి చూసి, 'అహః, శిథిలేశ్వరి కంఠాభరణం అయిన మహా జలసర్పం దర్శన మిచ్చిందా? ప్రసాదం




సమర్పించాలా? తప్పక సమర్పిస్తాను! ఆ ఒక్క సజీవ ప్రసాదాన్నీ స్వీకరించి మా అందరికీ ఏ హానీ కలగకుండా శిథిలేశ్వరి ఆలయానికి చేర్చు,' అంటూ కళ్ళు మూసుకుని ఉష్ణీషాన్ని ఎగరవేశాడు. అది గురిగా వచ్చి నా తలమీద పడింది. వెంటనే వాడు, 'ఓహో, ఎంత అదృష్టం నీది, జాంగ్‌లా! శిథిలేశ్వరి సేవికకు ఆహారమై, వచ్చే జన్మలో ఇభ్యజాతి కంతకూ నాయకుడివిగా జన్మించబోతున్నావు!' అన్నాడు.

"ఆ దుర్మార్గుడు ఏం చేయబోతున్నాడో నేను ఊహించే లోపలే వాడు సవర భేరుండానికి సైగ చేశాడు. భేరుండం ఒక్క దూకున వచ్చి పడవ మీంచి నన్ను నీటిలోకి గిరవాటు వేశాడు. నేను మునిగిపోయినట్టు నటించి, నీటి అడుగునే ఈదుకుంటూ దాపుల నున్న యీ లంక చేరాను. ఆకలితో, బడలికతో సగంచచ్చివున్న నామీద యింతకు ముందు మొసళ్ళు వచ్చి పడినై. మీరు రక్షించారు. ఇదీ నా కథ!"

శిఖిముఖి కొంచెం సేపు ఆలోచించి, "కేసరీ! నీ అభిప్రాయం ఏమిటి? జాంగ్‌లా చెప్పింది నమ్మటమా, మానటమా?" అని అడిగాడు.

"అతడు నమ్మదగిన విధంగా కథ చెప్పాడు!" అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఆ మాటలకు నవ్వి, అజిత వీరభద్రుల్నీ నాంగ్‌సోమ్‌నూ ప్రశ్నించాడు. వాళ్ళు జాంగ్‌లా చెప్పింది నిజంలా కనబడుతున్నదన్నారు.

"అయితే మనం ఉదయం బయలుదేరి పోయేప్పుడు జాంగ్‌లాను వెంట తీసుకుపోదాం. ఏమంటావ్, కేసరీ?" అని అడిగాడు శిఖిముఖి.

"తప్పకుండా మన పడవల్లో తీసుకుపోదాం. మళ్ళీ ఏదైనా ద్రోహం తల పెట్టే సూచనలు కనబడితే, యీసారి ఏ మాత్రం అవకాశం ఇవ్వకుండా కత్తులతో ముక్కలు



ముక్కలుగా నరుకుదాం," అన్నాడు విక్రమకేసరి.

అందరూ అక్కణ్ణించి కదిలి, తాము విడిది దిగిన చోటుకు బయలుదేరగానే జాంగ్‌లా, శిఖిముఖి, విక్రమకేసరుల పాదాలు తాకి వారి వెనకగా కర్రసాయంతో కుంటుతూ నడిచాడు.

సూర్యోదయంతోనే అందరూ నిద్ర మేల్కొని, కాలకృత్యాలు తీర్చుకుని పడవ లను ప్రయాణానికి సిద్ధపరిచారు. జాంగ్‌లాను శిఖిముఖి, విక్రమకేసరీ వున్న పడవ లోకి ఎక్కించారు. అవసరం అయినప్పుడు తెడ్లు వేయటానికి అతడు వీరభద్రుడికి సాయంగా వుండగలడని శిఖిముఖి అలా చేశాడు. వాళ్ళు లంక నుంచి బయలు దేరుతూ, మరికొందరు ఇభ్యులతో కొంచెం వెనకగా ప్రయాణం కట్టిన పడవ కోసం చుట్టుపక్కల అంతా పరీక్షించి చూశారు. పడవ జాడలేదు. బహుశా పడవలోనివాళ్లు దారి తప్పారేమో అన్న అనుమానం శిఖిముఖికీ, విక్రమకేసరికీ కలిగింది.

గాలివాలు బాగా వుండటంతో తెడ్లు వేయటం మాని పడవలకు తెరచాపలెత్తారు. నాంగ్‌సోమ్, అజితుడూ వున్న పడవ ముందుకు పోసాగింది. మధ్యాహ్నం



భోజనాలవేళ సమయంలో, ఏ లంక మీద దిగి వంటలు చేసుకుందామా అని శిఖిముఖీ వాళ్ళు ఆలోచిస్తూండగా, ఒక లంక మలుపులో నుంచి నీరు అల్లకల్లోలమవుతూ, వాళ్ళ పడవల కేసి రాసాగింది. అప్పటి వరకూ ప్రశాంతంగా వున్న నీటిమీద అంత లేసి అలలు ఎందుకు లేస్తున్నవో ఎవరికీ అర్థం కాలేదు.

నాంగ్‌సోమ్ తన పడవను దాపునవున్న లంక కేసి తెడ్లసాయంతో మళ్లిస్తూ, శిఖిముఖీ వాళ్ళను కూడా హెచ్చరించాడు. అంతలో లంక మలుపు తిరిగిన చోటు నుంచి హఠాత్తుగా రెండు పడవలు అలల



తాకిడికి కిందు మీదులవుతూ వాళ్ళ కేసి కొట్టుకు రాసాగినై.

ఆ పడవలలో ఉన్నవాళ్ళను శిఖిముఖీ, విక్రమకేసరీ వెంటనే గుర్తించగలిగారు. ఒక పడవలో వున్న శిథిలాలయ పూజారి చేతులెత్తి పెద్దగా అరుస్తూ, "జలసర్పం మనను మింగజూస్తున్నది! పడవల్ని లంకకు పట్టించండి!" అంటున్నాడు.

చూస్తూండగానే పూజారి చెప్పే ఆ జల సర్పం కూడా శిఖిముఖి వాళ్ళ కంట బడింది. ఆ సర్పం మెడా, తలా మాత్రం పాముకు వున్నట్టు వున్నది. కాని శరీరం మటుకు పదీ పన్నెండు ఏనుగుల ప్రమాణంలో లావుగా వున్నది. అది తన కాళ్లతో నీటిని అల్లకల్లోల పరుస్తూ, పూజారి పడవలలో వున్న వాళ్ళను పట్టుకునేందుకు తల కిందికీ పైకీ తిప్పుతున్నది.

ఆ దృశ్యం చూసి శిఖిముఖితో పాటు అందరూ గజగజ వణికిపోయారు. అదృష్ట వశాత్తూ వాళ్ళ పడవలు లంకకు సమీపాన వుండటంతో, అతి త్వరలోనే వాళ్ళు తీరాన్ని చేరుకోగలిగారు. శిథిలాలయ పూజారివాళ్ళ పడవలు మాత్రం జలజంతువు వల్ల లేచిన అలలలో చిక్కుకుని కిందు మీదులవుతూ నీటి వెంట కొట్టుకు పోసాగినై.

ఒడ్డుచేరిన శిఖిముఖీ వాళ్ళు చూస్తూండగానే జలజంతువు పూజారి వున్న పడవ లోపలికి తలపెట్టి ఒకణ్ణి నోట కరుచుకున్నది. పూజారీ, అతడి వెంట వున్నవాళ్లూ పిచ్చిగా అరుస్తూ పడవలను తెడ్లసాయంతో దూరంగా నడపసాగారు. జలజంతువు తాను పట్టినవాణ్ణి మింగేందుకు ఓ క్షణకాలం ఆగి, తిరిగి వాటి వెంటబడింది.

"శిఖీ! పనిలోపని, ఆ పూజారి దుర్మార్గుడు నా బాణం దెబ్బకు అందుతాడేమో చూస్తాను!" అంటూ విక్రమకేసరి పూజారి వున్న పడవ కేసి గురిగా బాణాలు వదలసాగాడు. —(ఇంకా వుంది)





# విదూషకుడి నేరం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, పాముతో చెరలాటాలాడే వాడికి ఎప్పటికైనా ప్రమాదం తప్పదు. నీకు హెచ్చరికగా ఉండగలందులకు మద్రదేశపు విదూషకుడి కథ చెబుతాను. శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

"పూర్వం మద్రదేశపు రాజు వద్ద ఒక ప్రఖ్యాతి చెందిన విదూషకుడుండేవాడు. అతను హాస్యం చెప్పటమే గాక, చూస్తేనే నవ్వు పుట్టించేటట్టుగా ఉండేవాడు. పొట్టిగా, బక్కగా ఉండేవాడు. అతని చెవులు ముంత చెవులాగుండేవి. నవ్వితే అతని నోరు ఈ చెవి నుంచి ఆ చెవిదాకా తెరుచుకునేది. చాలా చలాకీ అయిన మనిషి. హాస్యకథలు

## బేతాళ కథలు



చెప్పినది చెప్పకుండా చెప్పేవాడు. రాజ సభలో అందరినీ హాస్యం పట్టించేవాడు. రాజుగారని కూడా చూసేవాడు కాడు. తనను హేళన చేస్తే కూడా రాజుగారు ఏమీ అనేవాడు కాడు. అలాటప్పుడు మిగిలిన వాళ్ళు పైకి ఏమీ అనటానికి ఉండేదికాదు. కాని అందరికీ అతనంటే కోపమూ, భయమూ ఉండేవి.

విదూషకుడి వల్ల రాజుగారికి చాలా ఉపయోగాలుండేవి. తన కింద కొలువు చేసే వాళ్ళు ఏదన్నా మోసం చేసి, అది రుజువైతే శిక్షించటానికి వీలుండేది; కాని కేవలమూ అనుమానాలు మాత్రమే ఉన్నచోట విదూషకుడి హాస్యం వారి అక్రమాలకు విరుగుడుగా పని చేసేది. కొందరు అధికారులు ఏ దుష్కార్యాలైనా మొదలు పెట్టినప్పుడు విదూషకుడి హాస్యానికి గురికావటం జరిగి, తమ రహస్యం రాజుకు తెలిసి పోయిందనుకుని తమ దుష్కార్యాలు కట్టి పెట్టేవారు. హాస్యం మిష మీద విదూషకుడు ఏదో విధంగా అందరినీ నిందించేవాడు. ఎవరినన్నా అతను నిందించినప్పుడు వారి పట్ల ఆగ్రహం కలవారికి తృప్తిగా ఉండేది. ఇలా అనేక విధాల విదూషకుడు రాజుగారికి కనిపించని ఉపకారాలు చేస్తూ ఉండేవాడు. అందుకే ఒక్కొ సమయంలో విదూషకుడి హాస్యం తన మీదికి తిరిగినా, రాజు, తాము కూడా అందరితోబాటు నవ్వి ఊరుకునేవాడు.

ఇలా ఉండగా ఒకనాడు రాజుగారి జన్మదినోత్సవం జరిగింది. సాయంకాలం రకరకాల వినోదాలు జరిగాయి. నృత్యాలూ, గానాలూ, విందులూ, వినోదాలూ అయాయి. రాజుగారూ, సభికులూ కబుర్లలో పడ్డారు. విదూషకుడు విజృంభించి హాస్యకథలు చెబుతూ, మధ్య మధ్య ఎవరిని పడితే వారిని నోటికి వచ్చినట్టు అవహేళన చేస్తున్నాడు.

ఇలా వాగుతున్నవాడు కాస్తా, "ప్రపంచంలో నా కన్న మూఢుడు లేడని మీరంతా అనుకుంటున్నారు, నాకు తెలుసు. కాని నా కన్న కూడా పెద్ద మూఢుడు మన రాజు," అన్నాడు.

రాజుగారు విరగబడి నవ్వాడు. ఆయనతో బాటు అందరూ నవ్వారు.

"నేను అందవికారంగా ఉంటాను నిజమే. రాజుగారు అందగాడన్నదీ నిజమే. ఆయన అందమంతా ఆయన దొడ్డి కాళ్లలో ఉంది. ఆయనగారి కాళ్ళు గుర్రం మీద కూర్చుంటే ఎలా ఉంటాయో, నడిచేటప్పుడూ అలాగే ఉంటాయి," అన్నాడు విదూషకుడు. రాజు నవ్వాడు.

"ఈయనగారంతటి లోభిని మనం చూడ బోము. నా కన్న ఈయనకు పది లక్షల రెట్లు ఎక్కువ ఆస్తి ఉన్నది. అయితేనేం? నా కన్న రెట్టింపు తిండి కూడా తినలేడు," అన్నాడు విదూషకుడు. రాజు మళ్ళీ నవ్వాడు.

"మనకు బ్రహ్మదేవుడు రాజుగా ఈ మంద బుద్ధిని, ఈ లోభిని, ఈ దొడ్డి కాళ్ళవాణ్ణి, ఈ బట్టతల వాణ్ణి ఇచ్చినందుకు మనం ఏదో పాపం చేసి ఉండాలి," అన్నాడు విదూషకుడు.



రాజు ఒక్క కేక పెట్టి, "ఆగు! చాలించు!" అన్నాడు ఆగ్రహంతో. ఆయన తన భటుల కేసి తిరిగి, "ఈ నిర్భాగ్యుణ్ణి వెంటనే బంధించి, రేపు మన సింహానికి వెయ్యండి!" అన్నాడు.

విదూషకుడి రక్తం జిల్లుమన్నది. తాను అనగూడని మాట ఏమన్నాడో అతనికి తెలియలేదు. భటులు అతన్ని తీసుకు పోయి, రాజభవనంలోనే ఒక గదిలో ఖైదు చేశారు.

మర్నాడు ఉదయం కొందరు ఉద్యోగులు రాజుగారిని దర్శించి, విదూషకుణ్ణి క్షమించమనీ, క్షమించలేకపోతే మరణ



దండన కాకుండా మరే శిక్ష అయినా విధించ
మనీ వేడుకున్నారు.

"అతన్ని సింహానికి వేస్తాననేశాను. వేసి
తీరాలి," అన్నాడు రాజు.

"సింహానికి వేస్తే సింహం అతన్ని తినే
స్తుంది," అన్నారు సభికులు.

"ఒకవేళ అది అతన్ని తినకుండా
వదిలేస్తే నా కేమీ అభ్యంతరం లేదు,"
అన్నాడు రాజు.

"సింహంబోను నుంచి అతను ప్రాణా
లతో బయట పడితే అతన్ని తమరు మరో
విధంగా శిక్షించరు గద?" అని సభికులు
అడిగారు.

"అప్పుడు శిక్షించవలసిన అవసరం
లేదు, శిక్షించను," అన్నాడు రాజు.

సభికులు రాజుగారి వద్ద సెలవు పుచ్చు
కుని ఇవతలికి వచ్చేసి, విదూషకుణ్ణి
సింహం తినకుండా చేసేటందుకు మార్గాలు
ఆలోచించారు.

రాజుగారు పెంచే సింహం ఒక పెద్ద
గదిలో ఉంటుంది. ఆ గది చుట్టూ ఇనప
కమ్మీలు అమర్చి బోను లాగా తయారు
చేశారు. సింహానికి ఆహారం పెట్టటానికి ఒక
మనిషి ఉన్నాడు. విదూషకుడి మిత్రులైన
సభికులు అతని వద్దకు వెళ్ళి, "ఈ రోజు
సింహానికి తిండి బాగా పెట్టి, రేపటికి కూడా
ఆకలి పుట్టకుండా చెయ్యి," అన్నారు.

సింహం ఉండే బోనుకు రెండు ద్వారా
లున్నాయి. అవి ఎప్పుడూ మూసి ఉంటాయి.
సింహాన్ని సాకేవాడికి బాగా లంచం పెట్టి,
బోనులోకి వెళ్ళిన విదూషకుడు రెండో
ద్వారం దగ్గిరికి వచ్చేసరికి, వాడు దాన్ని
తెరిచేటట్టు ఒప్పించారు.

ఈ ఏర్పాట్లన్నీ విదూషకుడికి అతని
స్నేహితులు చెప్పారు. కాని అతనికి తాను
ప్రాణాలతో బయటపడతా నన్న ఆశ లేదు.

"నేను విదూషకుడి లాగా బతికాను.
అలాగే చస్తాను. నాకు పంచరంగుల దుస్తులు





తయారు చేయించండి. వాటి నిండా గజ్జెలూ, గంటలూ కట్టించండి," అన్నాడు విదూషకుడు తన మిత్రులతో. అవన్నీ తయారయాయి.

విదూషకుణ్ణి దండించే సమయం ఆసన్నమయింది. వేలకొద్దీ జనం సింహం బోను చుట్టూ మూగారు. రాజుగారు వచ్చి, "విదూషకుణ్ణి బోనులోకి తొయ్యండి," అని ఆజ్ఞ యిచ్చాడు.

భటులు విదూషకుణ్ణి తెచ్చారు. రంగు రంగుల దుస్తులు ధరించి, గజ్జెలు గల గల్లాడిస్తూ, పదిమంది నాట్యగత్తెలు నడిచి వస్తున్నట్టు చప్పుడు చేస్తూ భటుల వెంట వచ్చిన విదూషకుణ్ణి చూడగానే జనం గొల్లున నవ్వారు.

రాజుగారు కూడా బలవంతాన నవ్వు అపుకోవలసి వచ్చింది.

భటులు బోను తలుపులు తెరిచి, విదూషకుణ్ణి లోపలికి తోసి, చప్పున తలుపు మూసేశారు.

విదూషకుడు ఒక మూలగా పడుకుని ఉన్న సింహాన్ని చూశాడు. అది అంతకు ముందే ఎక్కి తొక్కినట్టు ఆహారం తిని ఉన్నది. దానికి రెండు గజాల దూరంలో నుంచి అతను రెండో ద్వారం వద్దకు వెళ్ళాలి. అవసరం వస్తే దాన్ని తెరిచేవాడు ఆ ద్వారం వద్ద నిలబడి ఉన్నాడు. విదూషకుడు మెల్లిగా ఒక్క అడుగు ముందుకు వేశాడు. అంత దాకా పడుకుని ఉన్న సింహం లేచి కూర్చుని, అతని కేసే చూడసాగింది.

అప్పుడు విదూషకుడు కోతి లాగా గెంతటమూ, నాట్యం చెయ్యటమూ, పిల్లిమొగ్గలు వెయ్యటమూ చేశాడు. బయటి జనం పగలబడి నవ్వుతున్నారు. గజ్జెల చప్పుడూ, గంటల చప్పుడూ విని సింహం బెదిరినట్టు కనబడింది. అదే సమయు మనుకుని విదూషకుడు దాని పక్కగా రెండో ద్వారం కేసి

పరిగెత్తాడు. కాని సింహం అతని కేసి ఒక అడుగు వేసి దూకబోయే భంగిమ ప్రదర్శించింది. మరుక్షణం అది దూకనేదూకింది. కాని ఇంతలోపలే విదూషకుడు రెండో ద్వారాన్ని సమీపించటమూ, అది తెరుచుకుని అతను బయట పడటమూ జరిగాయి.

ఎలాగైతేనేం విదూషకుడి ప్రాణాలు దక్కాయి. అందుకు సంతోషించనివాళ్ళు లేరు. రాజుగారు కూడా అతను ప్రాణాలు దక్కించుకోవాలనే కోరుకున్నాడు. తరవాత విదూషకుడు అతి కష్టం మీద రాజుగారి విదూషకుడుగా ఉండటానికి ఒప్పుకున్నాడు. కాని అతను ఎవరినీ మళ్ళీ నవ్వించలేదు. అసలు విదూషకుడు సింహంవాత పడినట్టే అయింది.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, విదూషకుడు ఏమి తప్పు చేశాడని రాజు అతన్ని సింహంవాత వేయించాడు? విదూషకుడు తనను నిందిస్తూ ఉంటే నవ్వినవాడు అకస్మాత్తుగా అంత కోపం చెందటానికి కారణమేమిటో తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విదూషకుడు రాజుకు దొడ్డికాళ్ళనీ, మందబుద్ధి అనీ, లోభితన మనీ అన్నవి వట్టి అబద్ధాలై ఉండాలి. అందుకే రాజు అందరితోపాటు నవ్వాడు. కాని రాజుకు బట్టతల అని విదూషకుడు అన్న మాట వాస్తవమై ఉంటుంది. రాజుకు ఆగ్రహం తెప్పించిన మాటలలో అది ఒక్కటే కొత్తగా అతను అన్న మాట. మిగిలిన మాటల కన్నిటికీ రాజు అదివరకు నవ్వనే నవ్వాడు. హాస్యానికైనా ఉన్న మాట అనగూడ దన్న సంగతి విదూషకుడు ఆ క్షణాన మరిచాడు. అదే అతను చేసిన తప్పు అయివుంటుంది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# దురాశాపరుడు

విలాసపురం అనే నగరంలో ఒక రత్న వర్తకు డుండేవాడు. అతని తండ్రి సముద్ర వ్యాపారం చేసి ముత్యాల వర్తకంలో చాలా లాభం సంపాదించి, విలాసపురంలోని రత్న వర్తకులలో చాలా గొప్పవాడుగా పేరు పొందాడు. కాని ఆయన న్యాయానికీ, నిజాయితీకి పేరు పడ్డవాడు. ఏ రత్నానికైనా ఆయన వెల కడితే దానికి తిరుగు ఉండేది కాదు. రత్నాలను నాణ్యం కట్టడంలో కూడా ఆయన గొప్ప నిపుణుడు.

ఆయన కొడుకు రత్నశెట్టి కూడా తండ్రికి తీసిపోని నిపుణుడే. అయితే అతను దురాశాపరుడు. వీలయిన చోటనల్లా మోసం చెయ్యటమే అతని పని. అందుచేత అతను తన తండ్రి చేసిన వ్యాపారంలో పదోవంతు కూడా చెయ్యకుండానే తండ్రి కన్న పదింతలు లాభాలు తీశాడు. వర్తకులు అతన్ని అంటరాని వాణ్ణి చూసినట్టు చూసేవారు.

ఒకనాడు రత్నశెట్టి దుకాణానికి మాసిన గుడ్డలతో ఒక నడివయసు మనిషి వచ్చి, ఒక అపూర్వమైన ముత్యాన్ని తీసి, అమ్మజూపాడు. అతను రత్నశెట్టితో, "అయ్యా, నన్ను చూసి అజన్మదరిద్రుణ్ణని తలచకండి. నేను ఒకప్పుడు బాగా బతికినవాణ్ణే. ఇలాటి ముత్యాలను ఎందరో స్నేహితులకు కానుకలుగా ఇచ్చాను. కాని కాలం కలిసి రాక నాకున్నదంతా పోయింది. ఈ ఒక్క ముత్యమే మిగిలింది. తిండికి కూడా లేని స్థితిలో, గత్యంతరం లేక దీన్ని అమ్ముకుంటున్నాను. గొప్ప రత్న నిపుణులైన తమకు దీని విలువ గురించి వేరే చెప్పనవసరం లేదు. అందుచేత దీన్ని మీరు తీసుకుని నాకు న్యాయమైన ధర ఇప్పించండి," అన్నాడు.

అన్యాయం చెయ్యటానికి ఇది మంచి అవకాశమని రత్నశెట్టికి తెలిసిపోయింది.

వి. చంద్రశేఖరం



ఆ పేదవాడు అమ్మచూపిన ముత్యం నిజంగా వెలలేనిది. అలాంటి ముత్యాన్ని తాను వీలయినంత చవుకగా కొనటానికి పరిస్థితి చాలా అనుకూలంగా ఉన్నది. తిండి కోసం తన దగ్గిర ఉన్న ఆఖరు ముత్యాన్ని అమ్ముకునేవాడు పెద్దగా బేరం ఆడలేడు.

అందుచేత రత్నశెట్టి ముత్యాన్ని చూసి, పెదవివిరిచి, తనకు దాన్ని కొనాలన్న ఆసక్తి ఏమాత్రమూ లేనట్టు మాట్లాడుతూ, "ఇది మీరు అనుకున్నంత విలువైన ముత్యం కాదు. దీన్ని నేను కొని పెద్దగా లాభం చేసుకునేది కూడా లేదు. ఎంతకు అమ్మదా మనుకుంటున్నారు?" అన్నాడు.

పేదవాడు ఈ మాట విని విచారంగా, "దాని విలువ మీకు తెలియనట్టు నటించకండి. మీరు న్యాయంగా నిర్ణయించిన ధర తీసుకునేటందుకు సిద్ధపడే మీ వద్దకు వచ్చాను," అన్నాడు.

రత్నశెట్టి ముత్యాన్ని ఇటూ ఇటూ తిప్పి చూసి, "ఇరవైవరహా లిస్తాను. అంతకన్న ఇస్తే నాకు గిట్టుబాటు కాదు. తరవాత మీ యిష్టం," అన్నాడు.

"ఏమి ధర్మం! ఏమి న్యాయం!" అంటూ ఆ బీదవాడు ఇరవై వరహాలు తీసుకుని, ముత్యాన్ని రత్నశెట్టి కిచ్చి వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకు, ఎండ వేళ, ఇద్దరు స్త్రీలు వచ్చి రత్నశెట్టి దుకాణం నీడలో నిలబడి మాట్లాడుకోసాగారు. వారి సంభాషణ బట్టి వాళ్ళు చాలా ధనికులనీ, అత్తా కోడళ్ళనీ రత్నశెట్టి గ్రహించాడు. కోడలి చేతులో చంటిబిడ్డ ఉన్నట్టున్నది.

"ధనగుప్తుడు సమయానికి నగలు అందించక మనని మోసం చేసేటట్టున్నాడు, అత్తా!" అన్నది కోడలు.

"ఇన్నాళ్ళుగా మనం ఏది కావాలంటే అది అందిస్తూ వచ్చాడుగదా, ఈసారే ఇలా అయింది. మనకు కావలసిన మేలురకం

వజ్రాలు ఇంకా అందలేదంటున్నాడు. నిజమే నేమో," అన్నది అత్త.

"పెళ్ళి ఇంకా వారం కూడా లేదుకదా, అతనికి వజ్రాలు అందే దెప్పుడు? హారం తయారయే దెప్పుడు?" అన్నది కోడలు.

ఈ మాటలు విన్న రత్నశెట్టికి చాలా పెద్ద బేరం వాసన తగిలింది. అతను ఆ స్త్రీలకు నమస్కారం చేసి, లోపలికి ఆహ్వానించి, "అమ్మా, మన దుకాణంలో చాలా మంచి రత్నా లున్నాయి, నగ లున్నాయి. చూసుకోండి, తప్పేముందీ? మీవంటి వారి బేరం కోసమే గదా మే మున్నది?" అన్నాడు.

"మరేమీ లేదు, నాయనా! నా మేనగోడలిని మంత్రిగారి కుమారుడి కిచ్చి చేస్తున్నాం. ఏదన్నా మంచి బహుమానం ఇవ్వకపోతే బాగుండదు, చూడూ! మంచి వజ్రాలహారం తయారుచేయించే పని ధనగుప్తుడికి అప్పజెప్పాం. అతను తాత్సారం చేసి, మమ్మల్ని ఇరుకున పెట్టాడు," అన్నది అత్త.

"అమ్మగారూ, మన దుకాణంలో మహారాణులు ధరించదగిన వజ్రాలహారం సిద్ధంగా ఉన్నది. చూపిస్తాను," అంటూ రత్నశెట్టి ఒక హారాన్ని తీసి చూపాడు.



"ఖరీదు ఎంతైనా కానీ, మనం పెట్టే నగ పెళ్ళికూతురికి నచ్చాలి. అందుచేత దీన్ని ఆ పిల్లకు చూపించి తెస్తాను. నేను తిరిగి వచ్చేదాకా నా కోడలు ఇక్కడే ఉంటుంది. ఎందుకైనా మంచిది, నా వెంట మీ దుకాణంలో ఉండే కుర్రవాణ్ణి పంపించు, తోడుగా వుంటాడు," అన్నది అత్త.

"దానికేమ్మా, మహారాజుగా చూపించి తీసుకురండి," అన్నాడు రత్నశెట్టి. అత్త వెంట రత్నశెట్టి దగ్గిర పనిచేసే గుమాస్తా వెళ్ళాడు.

వాళ్ళు వెళ్ళగానే కోడలు రత్నశెట్టితో, "మీ దగ్గిర మేలుజాతి ముత్యాలున్నాయా?



పెళ్ళికూతురికి మంచి ఉంగరం ఒకటి చేయిస్తాం," అన్నది.

రత్నశెట్టి తాను పేదవాడి వద్ద ఇరవై వరహాలకు కొన్న ముత్యాన్ని మరికొన్నిటితో కలిపి చూపాడు. కోడలు పేదవాడి ముత్యాన్ని ఎన్నుకుని, దాని ఖరీదు ఎంతని అడిగింది.

"అది చాలా అపూర్వమైన ముత్యం, అమ్మగారూ. దాని ధర రెండువేల వరహాలు," అన్నాడు రత్నశెట్టి.

ఇంతలోకే దుకాణం బయట గలాటా జరిగింది. ఇద్దరు మనుషులు కత్తులు దూసి భయంకరంగా పోట్లాడుకోసాగారు. జనం గుమికూడారు. రత్నశెట్టి కూడా దుకాణం బయటికి వచ్చి గలాటా చూడసాగాడు. ఇంతలో రక్షకభటులు వచ్చారు. పోట్లాడుకునే వాళ్ళను పట్టుకున్నారు. చుట్టూ చేరినవాళ్ళు చాలామంది అక్కడ్డించి చల్లగా జారుకున్నారు. అల్లరి తన దుకాణం ముందే జరగటంవల్ల రత్నశెట్టి ఎక్కడికీ పోలేకపోయాడు.

"జరిగిన దంతా చూశావు. సాక్ష్యం చెప్పటానికి పద!" అంటూ రక్షకభటులు రత్నశెట్టిని నిర్బంధించారు.

"దుకాణం నేను చూస్తూ ఉంటాను, వెళ్ళిరండి," అన్నది కోడలు.

ముక్కూమొహమూ తెలియని స్త్రీకి దుకాణం అప్పగించటం రత్నశెట్టికి ఏమాత్రమూ ఇష్టం లేకపోయినా వెళ్ళక తప్పిందికాదు.

న్యాయాధికారి ముందు రత్నశెట్టి ఒక మాటకు ఒకటి చెప్పాడు. అతని ధ్యాస అంతా దుకాణం మీదనే ఉన్నది. రత్నశెట్టి చెప్పేదంతా న్యాయాధికారికి అబద్ధంగా తోచి, "నువే అసలు నేరస్తుడల్లే కనిపిస్తున్నావు!" అంటూ వేసిన ప్రశ్నలే మళ్ళీ మళ్ళీ వేసి, చాలాసేపు నిలబెట్టి మరీ పంపేశాడు.

రత్నశెట్టి దుకాణానికి తిరిగి వచ్చేసరికి కోడలు అక్కడ లేదు. బిడ్డ మాత్రం ఒక వక్క పడుకోబెట్టి గుడ్డ కప్పి ఉన్నది. దుకాణం నౌకరు కూడా ఇంకా తిరిగి రాలేదు. రత్నశెట్టికి అంతా అయోమయంగా ఉన్నది.

ఇంతలో నౌకరుకుర్రాడు పరిగెత్తుకుంటూ వచ్చి, "మోసం! వచ్చి మోసం!" అన్నాడు.

వాడు అత్త వెంట చాలా దూరం వెళ్ళాక ఆమె ఒక ఆవరణలో ప్రవేశిస్తూ, "ఇక్కడే ఉండు. ఇప్పుడే వస్తాను," అన్నదిట. వాడు ఎంతసేపు చూసినా ఆవిడ రాలేదుట. చివరకు వాడు లోపలికి వెళ్ళి చూస్తే అది సత్రం! దాని ఆవరణకు నాలుగువేపులా ద్వారా లున్నాయుట. అత్త జాడ ఎక్కడా కనిపించక, ఆమె మరో ద్వారంకుండా వెళ్లిపోయి ఉంటుందనుకుని, నౌకరు తన యజమానికి ఈ మాట చెప్పడానికి వచ్చాడు.

రత్నశెట్టి గుండె అవిసిపోయింది. అతను బిడ్డ మీద కప్పి ఉన్న గుడ్డ తీసి చూస్తే, దాని అడుగున మట్టిబొమ్మ.

సరుకు చూసుకుంటే, దాదాపు దుకాణమంతా ఖాళీ అయి ఉన్నది.

ఆ దెబ్బతో రత్నశెట్టి పకీరై పోయాడు. ఇతర వర్తకు లెవరూ అతనికి సహాయం చెయ్యలేదు. అతను ఇల్లూ వాకిలీ అమ్ముకుని, చిల్లరసామాను కొట్టు పెట్టుకుని పేదగా బతకవలసి వచ్చింది.

ఒకనాడు ఒక శ్రీమంతుడు గుర్రం మీద రత్నశెట్టి దుకాణం ముందు ఆగి, "రత్నశెట్టి ఉప్పుశెట్టి అయినట్టుందే? నన్ను గుర్తించలేవా? నా దగ్గిర ఒక ముత్యాన్ని ఇరవై వరహాలకు కొన్నావు. జ్ఞాపకముందా? నా ముత్యం నాకు తిరిగి చేరిందిలే. ఇకనైనా న్యాయంగా వ్యాపారం చేసుకో. నా రాజ్యంలో అన్యాయం జరిగితే నేను సహించను," అని ముందుకు సాగిపోయాడు.





# రాజుగారి మంగలి

పుష్కలావతీ నదీతీరాన ఒక చిన్న రాజ్యం ఉండేది. దాన్ని పాలించేరాజు అకస్మికంగా చనిపోవటం చేత ఆయన కొడుకు సుదర్శను డనే వాడు చాలా చిన్న తనంలో రాజయాడు. అతనికి రాజ్యపాలనలో మంత్రీ, తదితరులూ సాయపడుతూ వచ్చారు. అయితే సుదర్శనుడి అంతరంగిక సలహాదారు ఆస్థానమంగలి.

ఈ మంగలి నడి వయసు దాటుతున్న వాడు. సుదర్శనుడి తండ్రి పాలించినంత కాలమూ ఆయన తన మంత్రికి సైతం చెప్పటానికి వీలులేని రహస్యాలను ఈ మంగలికి చెప్పి, అతడి సలహాల ద్వారా చాలా లాభం పొందుతూండేవాడు.

రాజ్యాభిషేకం అయినది లగాయతు సుదర్శనుణ్ణి వెంటనే పెళ్ళాడమని మంత్రి మొదలైన వాళ్ళు ఒత్తిడి చేయసాగారు. రాజ్యానికి ఒక్క రాజేకాదు, రాణి కూడా ఉండాలన్నారు. సుదర్శనుడు "చూద్దాం" అని మాట దాటించేస్తూ వచ్చాడు.

సంగతేమిటంటే, సుదర్శనుడికి పెళ్ళాడాలనే ఉన్నది. కాని అతనికి ఆడవాళ్ళంటే చాలా అనుమానం. అందంగా ఉన్నవాళ్ళు నీతిగా ఉండరనీ, అందమూ, నీతీ ఉన్న వారిలో సాధుత్వం ఉండదనీ, అన్నీ ఉన్న మనిషిని ఎన్నిక చెయ్యటం ఎవరివల్లా కాదనీ అతని భయం. అయితే ఈ మాట మంత్రి మొదలుగాగల వాళ్ళతో అనటం అనుచితంగా ఉంటుంది.

ఒకరోజు మంగలి సుదర్శనుడికి గడ్డం గీకుతూ, "ప్రభువు వారు వివాహం మాట తల పెట్టకుండా ఉన్నారేమి అని ప్రతి వాళ్ళూ అడిగేవాళ్ళే, బాబయ్యా! నాకు మాత్రం ఏం తెలుసునని జవాబు చెబుతున్నాను. అంతకంటె మంచి సమాధానం ఉంటే అదే చెబుదును!" అన్నాడు.

ఆర్. సీతాపతి

వెంటనే సుదర్శనుడు, స్త్రీల విషయంలో తనకున్న సందేహం చెప్పేసి, "ఒరే, కుల గోత్రాలు కూడా వద్దు, చూడ చక్కనిదీ, నీతి గలదీ, మంచితనం గలదీ అయిన కన్యను ఎలా తెలుసుకోవటమో నీకు తెలిస్తే చెప్పు. ఈ క్షణం పెళ్ళాడేస్తాను," అన్నాడు.

మంగలి ఒక్క క్షణం ఆలోచించి, "అదే సమస్య అయితే దానికి ఉపాయం ఉన్నది, బాబయ్యా! నా దగ్గిర ఒక అద్దం ఉన్నది. అందులో ఎవరిని చూసినా వాళ్ళ కుళ్లంతా కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది. తమరి కెవరి నన్నా చేసుకోవాలని ఉన్నప్పుడు నాకు కాస్త అవకాశం ఇప్పించారంటే, నా అద్దంతో వాళ్ళ జాతకం చదివేస్తాను," అన్నాడు.

ఈ మాట వినేసరికల్లా సుదర్శనుడికి ఎక్కడలేని ధైర్యమూ వచ్చేసింది. "ఒరే, మంగలీ! నాకు కావలిసిన భార్యను సంపాదించి పెట్టావంటే నేను నీ మేలు ఎన్నటికీ మరవను," అని పంపేశాడు.

ఆ రోజే అతను తన సభలో తాను పెళ్లాడ నిశ్చయించినట్టు ప్రకటన చేశాడు. ఆ సాయంత్రానికల్లా ఈ వార్త ఊరంతా తెలిసిపోయింది. రాజుగారు కులమూ, హోదా పాటించరుట! ఆయనకు కావలసినది బుద్ధిమంతురాలూ, అందగత్తే అయిన



కన్య! ఈ వార్త తెలుస్తూనే అందగత్తెలమనుకున్న వారంతా అద్దాలలో తమ ముఖాలను చూసుకుని, "ఇది రాణీ కాబోయే ముఖమేనా?" అని తమను తాము ప్రశ్నించుకున్నారు.

అయితే మర్నాడు తెల్లవారేసరికల్లా మరొక పుకారు కార్చిచ్చులాగా నగరమంతటా వ్యాపించింది. రాజుగారు పెళ్లాడబోయే కన్యను రాజుగారి మంగలి తన మంత్రపుటద్దంలో చూస్తాట్ట ఆ దెబ్బతో వారి గుట్టుమట్లన్నీ అతనికి తెలిసిపోతాయట!

ఈ మాట వింటూనే రాణీ అవుదామని ఆశపడ్డ వారందరి గుండెల్లోనూ రాయి



పడింది. రాణివాసం మాట దేవు డెరుగు; తమ గుట్టంతా మంగలి వెధవకు తెలిసి పోతే పరువుగా బతికే యోగ్యత ఉంటుందా?

వారం గడిచినా రాజుగారిని పెళ్ళాడ టానికి ఒక్క కన్యా ముందుకు రాలేదు.

"ఏమిరా, మంగలీ? పెళ్లాడు, పెళ్లాడు అని అన్నాళ్లూ నన్ను చంపుకు తిన్నారే, పెళ్లాడతానన్న తరవాత ఒక్కరూ ముందుకు రారేం?" అని సుదర్శనుడు మంగలిని అడిగాడు.

"నా అద్దం సంగతి అందరికీ తెలును, బాబయ్యా! అందులో ముఖం చూపించ టానికి ఎన్ని గుండె లుండాలి? దారితప్పి మనిషిగా పుట్టిన ఏ దేవతో తమర్ని పెళ్ళా డాలి గాని, మామూలు ఆడది తమతో బాటు సింహాసనం మీద కూర్చోనిస్తానా?" అన్నాడు మంగలి దర్పంగా.

"అలా అయితే, నువ్వు ఒక నెలరోజులు దేశాటన చేసి, నీ అద్దం మెచ్చినదాన్ని తీసుకురా," అన్నాడు సుదర్శనుడు.

దారిఖర్చుల కిచ్చిన సొమ్ము తీసుకుని మంగలి దేశాటనకు బయలుదేరాడు. అతను ఒక్కొక్క గ్రామానికీ వెళ్ళి, రాజుగారి ఆజ్ఞాపత్రం చూపించి, రాజుగారికి వధువును వెతుకుతున్నానని గ్రామపెద్దలకు చెప్పి, "రాణీ కాదగిన కన్యలు ఎవరన్నా ఉంటే చెప్పండి," అని అడిగేవాడు.

అందరూ తలా ఒక పిల్లపేరూ చెప్పే వారు. ఒకరు చెప్పిన పిల్లను మరొకరు కొట్టిపారేసేవారు. నలుగురు గ్రామపెద్దలు ఏకగ్రీవంగా ఒక పిల్లపేరు చెప్పటం జర గనే లేదు.

ఇలా గ్రామాలు చూసుకుంటూ మంగలి చాలాదూరం వెళ్లాడు. ఒకనాటి మధ్యాహ్నం అతను ఒక కొండ ప్రాంతం చేరుకున్నాడు. అతనికి ఆకలీ, దప్పీ కలిగాయి. కొండ ఎగువన గొర్రెలమంద కనిపించింది. వాటిని కాసే మనిషి కోసం వెతుక్కుంటూ కొండ

ఎక్కేసరికి కొంత నీడపట్టున ఒక బాలిక కనబడింది.

"అమ్మాయీ, ఆకలి మండిపోతున్నది. దగ్గిరలో గ్రామం ఉన్నట్టులేదు. తినటాని కేమల్నా ఉన్నదా?" అని మంగలి ఆ పిల్లను అడిగాడు.

"అటుపక్క గ్రామం ఉన్నదిగాని నువు ఆకలితో ఏం పోతావు? నేను తెచ్చుకున్న కూడు తిను, తాతా!" అంటూ ఆ పిల్ల తన మూట విప్పి, తాను తెచ్చుకున్న జొన్న రొట్టెలూ, కూరా పెట్టింది. వాటిని తిని, తాబేటికాయలో నీళ్ళు తాగి మంగలి తేరుకున్నాడు.

"ప్రాణం నిలబెట్టావు, తల్లీ!" అంటూ మంగలి ఆ పిల్ల కేసి చూసి, దిగ్భ్రమ చెందాడు. ఆమె ముఖం చంద్రబింబం లాగున్నది. చెంపకు చేరడేసి కళ్ళు. నవ్వితే సొట్టలు పడే బుగ్గలు. బారెడు పొడుగున్న జుట్టు. పాత బట్టలు కట్టుకుని కూడా పార్వతీదేవి లాగా ఉన్నదా పిల్ల!

"ఆహా. ఈ పిల్లకు తలదువ్వి కొప్పు పెట్టి, పట్టుబట్టలు కట్టి, నగలు అలంకరించి నట్టయితే ఈమె ముందు ఏ రాజకన్యక నిలబడగలదు? ఈమె స్వభావం కూడా ఎంతో మంచిది. కల్లా, కపటమూ లేని మనిషి," అనుకున్నాడు మంగలి.



అతను ఆ పిల్లతో, "అమ్మా, నిన్ను మా రాజుగారి కిచ్చి పెళ్లి చేస్తాను. ఒప్పు కుంటావా?" అని అడిగాడు.

"రాజుగారికి పెళ్లాం కావటం నా వల్ల అవుతుందా, తాతా?" అన్నదామె.

"నువు చెయ్యవలిసిందేమి లేదు. ఇప్పుడున్నట్టే ఉంటే చాలు. నిన్ను రాజుగారికి చూపిస్తాను, నా వెంట వస్తావా?" అన్నాడు మంగలి.

ఆమె ఒప్పుకున్నది. ఇద్దరూ బయలుదేరి రాజభవనం చేరుకున్నారు. మంగలి అంతఃపురంలో దాసీల చేత ఆ పిల్లకు చక్కగా స్నానం చేయించి, అలంకరింపజేయించాడు. దాసీలు ఆమెకు జుట్టు అందంగా ముడివేసి, పూలుపెట్టి, ఆమె శరీరానికి సుగంధ లేపనాలు పూసి, ఆపాద మస్తకమూ నగలుపెట్టి, మంచి బట్టలు కట్టబెట్టి తీసుకువచ్చే సరికి మంగలికే కళ్ళు చెదిరాయి. ఈ మనిషే గొర్రెలు కాచుకుంటూ ఉండిన పిల్ల అనుకోవటం అతనికి చాలా కష్టమయింది.

అతను తన ఇంటి నుంచి ఒక అద్దం తెచ్చి, అందులో రాజుగారికి ఆ పిల్ల ప్రతిబింబం చూపించి, "చూడండి, బాబయ్యా, పిల్లలో ఒక్క మచ్చ ఉన్నదేమో!" అన్నాడు. సుదర్శనుడు అద్దం లోపలి బింబాన్ని చూసీ, పిల్లను చూసీ పరవశం చెంది ఆమెను పెళ్ళాడేశాడు. వివాహ సమయంలో మంగలికి మంచి జాగీరు లభించింది.

అందరికీ మంగలి అద్దంలో ఎంతో గురి కుదిరింది. గొప్ప గొప్ప వాళ్ళందరూ తమ భార్యల ప్రతిబింబాలను ఆ అద్దంలో చూసి, వాళ్ళను గురించి నిజం తెలుసుకుందామనుకున్నారు. కాని అందుకు అవకాశం ఇవ్వకుండా మంగలి, "అద్దం పగిలిపోయింది, బాబయ్యా! నిక్షేపంలాటి అద్దం!" అని అందరితోనూ అనేశాడు.





# సముద్ర కన్యలు

ఆల్జియర్స్ నగరంలో అబ్దుల్లా అనే యువకు డుండేవాడు. అతని తండ్రి వర్తకం ద్వారా అపారధనం సంపాదించి చనిపోయాడు. అబ్దుల్లా తన చుట్టూ స్నేహితులను ఉంచుకుని వారితో కలసి సమస్తసుఖాలూ అనుభవిస్తూ వచ్చాడు. కొంత కాలానికి అతని పిత్రార్జిత మంతా హారతికర్పూరం లాగా హరించుకు పోయింది.

పేదరికం వచ్చిపడేసరికి అబ్దుల్లాకు ఏమి చెయ్యాలో తోచలేదు. అతడు అజ్ఞాతంగా బతుకుదామనుకుని, తన గుర్రం ఎక్కి, మధ్యధరా ప్రాంతం కేసి బయలుదేరాడు.

దారిలో అతని కొక కీకారణ్యం తగిలింది. అందులో ఒక చోట చెట్ల మధ్య తెరిపి కన బడింది. అక్కడి దృశ్యం చూసి అబ్దుల్లా నిర్ఘాంతపడి నిలిచిపోయాడు. ఒక ఎత్తయిన చెట్టుకొమ్మకు ఒక స్త్రీ తలకిందులుగా వేళ్ళాడుతున్నది.

అబ్దుల్లా ఆమెను సమీపించి చూశాడు. ఆమె గొప్ప సౌందర్యవతి అనటానికి ఏమీ సందేహం లేదు. ఆమె మెడపైన గాటు కనిపించింది. ఆ గాటు నుంచి మూడు రక్తపు చుక్కలు దిగువ నున్న పళ్ళెంలో పడ్డాయి. అబ్దుల్లా వంగి ఆ రక్తపు చుక్కలను పరీక్షిస్తే అవి మూడు కెంపులని స్పష్టమయింది. నిర్జీవంగా ఉన్నట్టు వేళ్ళాడే ఆ స్త్రీలో ఇంకా ఏ మాత్రమైనా ప్రాణం ఉన్నదేమో చూడటానికి అతను అమె శరీరాన్ని తాకటానికి యత్నించాడు. కాని అతనికి అది సాధ్యం కాలేదు అమె చుట్టూ అదృశ్యంగా ఏదో బలమైన అడ్డున్నట్టు అనిపించింది.

తరవాత అతను నేల మీద ఉన్న పళ్ళెంలోని మూడు కెంపులలో ఒకటి తీసుకుని తన తలపాగాలో దాచుకుని, "ఇదంతా నా భ్రమ అని ఎవరన్నా అంటే నిజమని

ఆల్జీరియా జానపద కథ



ఈ కెంపు చూపి నిరూపిస్తాను," అనుకుంటూ ముందుకు సాగి, కాలక్రమాన ఒక నగరం చేరుకున్నాడు.

ఇదే నగరంలో ఉండే సుల్తానుకు ఒక కుమార్తె ఉండేది. ఆమె అందగత్తె మాత్రమే కాదు, మంత్ర శాస్త్రజ్ఞానమూ, భవిష్యజ్ఞానమూ కలది. సుల్తాను దగ్గిర ఉండే వజీరు కొక కొడుకుండేవాడు. సుల్తాను కుమార్తెకూ, వజీరు కుమారుడికీ పెళ్ళి చేద్దామని పెద్దవాళ్ళిద్దరూ నిశ్చయించారు. సుల్తాను కుమార్తె ఇందుకు వెంటనే సమ్మతించక, "నన్ను పెళ్ళాడేవాడు నా కోరికలు కొన్ని తీర్చాలి. వజీరు కొడుకు వాటిని తీర్చితే అతన్ని పెళ్లాడటానికి నాకేమీ అభ్యంతరం లేదు," అని తండ్రితో అన్నది.

"ఏమిటా కోరికలు?" అని సుల్తాను అడిగాడు.

"మొదటిది, నాకు మూడు కెంపులు కావాలి. నన్ను పెళ్ళాడేవాడు వాటిని తేవాలి," అన్నది సుల్తాను కుమార్తె.

"నీకేమైనా మతిపోయిందా ఏమిటి? మన దేశంలో కెంపులు ఎక్కడున్నాయి?" అన్నాడు సుల్తాను.

"ఎక్కడి నుంచి తెచ్చినా నాకు ఒకటే. వాటిని మటుకు తెచ్చి తీరాలి," అన్నది సుల్తాను కుమార్తె.

ఆమె ఇలా మొండి కెత్తేసరికి వజీరు, కెంపులు గలవాళ్ళు తమ వద్ద ఉన్న కెంపులను తెచ్చి యిస్తే వారికి అపారమైన బహుమానాలు లభిస్తాయని చాటింపు వేయించాడు. అబ్దుల్లా తన వద్ద నున్న కెంపు తీసుకుని సుల్తాను వద్దకు వెళ్ళి, తన వద్ద ఈ ఒక్క కెంపే ఉన్నదని చెప్పి, ఆయనకు సమర్పించాడు.

సుల్తాను కుమార్తె దాన్ని చూసి. "ఇది చాలా అందంగా ఉన్నది కాని నాకు మూడు కెంపులు కావాలి. ఒక్కదానితో పని జరగదు," అన్నది తన తండ్రితో.



"ఉన్నది ఇదొక్కటే. మరి రెండు తెమ్మంటే ఎక్కడి నుంచి తేచ్చేటట్టు?" అన్నాడు సుల్తాను.

"ఒకటి తెచ్చినవాడే మిగతా రెండూ తేగలడు," అన్నది కూతురు.

సుల్తాను అబ్దుల్లాను పిలిపించి, "మరి రెండు కెంపులు కావాలి. అవి తెస్తే నీవు కోరిన బహుమానం ఇస్తాను. లేకపోతే తల తీయిస్తాను," అన్నాడు.

"చిత్తం," అని అబ్దుల్లా ఇంటికి తిరిగి వచ్చి, తన దుకాణం మూసేసి, కత్తి చేత బట్టి, గుర్రమెక్కి అరణ్యంలోకి వెళ్ళాడు. ఆ స్త్రీ ఇంకా చెట్టుకొమ్మకు అలాగే వేళ్లాడుతూ ఉండటం అతడి కంటబడింది.

ఇంతలో పెద్దగా మెరుపు మెరిసి, ఉరిమింది. వేళ్ళాడే స్త్రీ ముందు ఒక మాంత్రికుడు, నల్లని దుస్తులు ధరించి ప్రత్యక్షమయాడు. అతడు వేళ్ళాడే స్త్రీని దింపి, నేల మీద పడుకోబెట్టి, మంత్రదండంతో ఆమె మెడ మీది గాయాన్ని తాకాడు. వెంటనే ఆమె ఏమీ జరగనట్టు లేచి నిలబడింది. ఇప్పు డామె అబ్దుల్లా కంటికి ఇంకా ఎన్నో రెట్లు అందంగా కనబడింది.

"ఇప్పటికైనా నన్ను పెళ్ళాడటానికి అంగీకరిస్తావా?" అన్నాడు మాంత్రికుడు.



"నన్ను వెయ్యి ముక్కలుగా నరికినా నిన్ను పెళ్ళాడను!" అన్న దామె.

వెంటనే మాంత్రికుడు తన చేతిలో ఉన్న కొరడా ఎత్తి ఆమెను బలంగా కొట్టాడు. వాడు మళ్లీ కొరడా ఎత్తి ఆమెను రెండోసారి కొట్టే లోపుగా, అబ్దుల్లా మాంత్రికుడి వెనకగా వెళ్లి, తన కత్తితో వాడి మెడ నరికేశాడు.

ఆమె పరిగెత్తుకుంటూ వచ్చి అబ్దుల్లాను ఆలింగనం చేసుకుని, "నన్ను రక్షించారు. నేను యావజ్జీవం మీ బానిసను," అన్నది.

ఆమె అతనికి తన కథ అంతా చెప్పింది. ఆమె పేరు కెంపు. ఆమె ఒక సముద్ర



రాజు కూతురు. ఒక ఏడాది క్రితం ఈ మాంత్రికుడు తన మాయాప్రభావంతో ఆమెను తెచ్చి, రోజూ తనను పెళ్ళాడమని బలాత్కరిస్తున్నాడు. ఆమెను చెట్టుకు వేళ్ళాడదీసి, మెడ మీద గాటుపెట్టి, ఆమె రక్తపు చుక్కలు కెంపులుగా మారితే వాటిని సంగ్రహిస్తాడు.

"దేవుడి దయవల్ల నీకు వాడి నుంచి ఇప్పుడు విముక్తి లభించింది. గనక నన్ను పెళ్ళాడ గలవా?" అని అబ్దుల్లా కెంపును అడిగాడు.

"తప్పక పెళ్ళాడతాను. కాని ముందు పెళ్ళికి కావలిసిన ఏర్పాట్లు చూడాలి. నన్ను సముద్రతీరానికి తీసుకుపొండి," అన్న దామె.

ఆమెను అబ్దుల్లా తన గుర్రం మీద ఎక్కించుకుని సముద్రతీరానికి వెళ్ళాడు. తాను తిరిగి వచ్చిన దాకా అక్కడే వుండమని చెప్పి, కెంపు సముద్రంలోకి దూకింది.

కొద్ది గంటలు గడిచాయి. ఆమె ఇక రాదని అబ్దుల్లా నిరాశపడుతూండగా సముద్రం మీది నుంచి పెద్ద ఊరేగింపు లాగా, గుర్రా లెక్కినవాళ్ళూ, ఒక మేనా, బోయీలూ, సాయుధ భటులూ వచ్చారు. మేనా తలుపులు తెరిచే ఉన్నాయి. దాని లోపల బంగారు జలతారు దుస్తులు ధరించి కెంపు కూర్చుని ఉన్నది. అబ్దుల్లా ఆమెను సపరివారంగా తన ఇంటికి తీసుకుపోయి, వైభవంగా వివాహమాడి, వారం రోజుల పాటు విందులతోనూ, వినోదాలతోనూ గడిపాడు.

అబ్దుల్లా తిరిగి వచ్చాడని తెలిసి సుల్తాను అతన్ని పిలిపించి, "కెంపు లేవి?" అని అడిగాడు.

"నేను నా పెళ్ళిసందడిలో కెంపుల మాట మరిచాను. వాటిని తెచ్చి ఇస్తాను. ఒక నెల వ్యవధి ఇవ్వండి," అన్నాడు అబ్దుల్లా.

"నెల లోపల కెంపులు తీసుకురాకపోతే నీ తల పోతుంది," అన్నాడు సుల్తాను.

అబ్దుల్లా విచారంతో తిరిగి రావటం చూసి అతని భార్య కారణ మడిగింది. అబ్దుల్లా కెంపుల మాట చెప్పాడు. ఆమె వెంటనే కత్తితో తన చేతికి గాయం చేసి, రెండు పెద్ద రక్తపుబొట్లను రాల్చింది. వెంటనే అవి కెంపులుగా మారాయి. వాటిని అబ్దుల్లా సుల్తానుకు సమర్పించాడు.

సుల్తాను ఈ రెండు కెంపులనూ కూడా తన కుమార్తె కిచ్చి, "నీ కోరిక తీరి నట్టేనా?" అని అడిగాడు.

"ఒక కోరిక తీరింది. ఇంకొకటి ఉన్నది. ఒక హారానికి సరిపడే పెద్ద ముత్యాలు కావాలి. నన్ను పెళ్ళాడ దలిచినవాడు ఆ ముత్యాలు తేవాలి," అన్నదామె.

"ఈ దేశంలో ముత్యాలు ఎక్కడ దొరుకు తాయి?" అన్నాడు సుల్తాను.

"కెంపులు దొరికినవాడికి ముత్యాలు మాత్రం దొరకవా?" అన్నదామె.

సుల్తాను మరోసారి అబ్దుల్లాను పిలి పించి, "నా కుమార్తెకు ముత్యాలహారం కావాలట. హారానికి సరిపడినన్ని పెద్ద ముత్యాలు తీసుకురా. నెల రోజులు గడు విస్తున్నాను," అన్నాడు.



"చిత్తం," అని అబ్దుల్లా ఇంటికి తిరిగి వెళ్ళి, తనకు సంప్రాప్తమయిన కొత్త బెడద గురించి తన భార్యకు తెలిపాడు.

"దాని కేం భాగ్యం? ముత్యాలు కూడా ఇద్దాం," అంటూ ఆమె ఒక కాగితం మీద ఏదో రాసి అబ్దుల్లా చేతికిచ్చి, "ఈ కాగి తాన్ని సముద్రం మీద విసిరి వేసి, జవాబు కోసం ఓపికగా వేచి ఉండండి," అన్నది.

అబ్దుల్లా సముద్రతీరాన్ని చేరుకుని, కెంపు రాసిన లేఖను సముద్రం మీదికి విసిరి వేసి, అక్కడే నిలబడ్డాడు. కొద్ది సేపటికల్లా సముద్రం మీది నుంచి మరొక ఊరేగింపు బయలుదేరి వచ్చింది. ఈసారి



మేనాలో కెంపును పోలిన మరొక కన్య ఉన్నది. ఆమె పేరు ముత్యం.

అబ్దుల్లా ముత్యాన్ని కూడా తన ఇంటికి తెచ్చుకుని, మొదటి భార్య అనుమతితో ఆమెను పెళ్ళాడాడు. కెంపూ, ముత్యమూ అక్కా చెల్లెళ్ళు. పెళ్ళిసందడి తగ్గిపోయాక అబ్దుల్లా కెంపుకు సుల్తాను కోరిక జ్ఞాపకం చేశాడు. అప్పుడామె తన చెల్లెలితో ఏదో జగడం పెట్టుకుని, ఆమెను నానా తిట్లూ తిట్టి, చివరకు దవడ పగిలేటట్టు కొట్టింది. ఇలా తిట్లూ, దెబ్బా తిని ముత్యం కళ్ళ వెంట జలజలా కన్నీరు రాల్చింది. ఆ కన్నీటి బిందువులు నేల తాకగానే మేలి ముత్యాలుగా మారిపోయాయి. అబ్దుల్లా వాటిని తీసుకుపోయి సుల్తాను కిచ్చాడు. సుల్తాను వాటిని తన కూతురి కిచ్చి, "ముత్యాలు కూడా ముట్టాయి. ఇకనైనా పెళ్ళికి ఒప్పుకుంటావా?" అని అడిగాడు.

"నాది మరొక్క కోరిక ఉన్నది. అది కూడా తీర్చినవాణ్ణి తప్పక పెళ్ళాడతాను. నాకు కోడిగుడ్డు ప్రమాణం గల కస్తూరి కావాలి," అన్నది సుల్తాను కూతురు.

కస్తూరి ఎలా ఉంటుందో కూడా సుల్తాను ఎరగడు, కాని తెచ్చేవాడు ఉన్నాడు గనక, ఆయన మళ్ళీ అబ్దుల్లాకు కబురంపి, కోడిగుడ్డు ప్రయాణం గల కస్తూరి నెల రోజులలో తేకపోతే తల తీసేస్తానని హెచ్చరించాడు.

ఈసారి కెంపు అతనికి మరొక చీటీ ఇచ్చి సముద్రతీరానికి పంపించి, తన రెండో చెల్లెలైన కస్తూరిని తెప్పించి, ఆమెను కూడా అతనికి పెళ్ళి చేసింది. ఈ పిల్ల ఒంటి నుంచి ఎప్పుడూ కస్తూరి వాసన రావటం అబ్దుల్లా గమనించాడు.

సుల్తాను పెట్టిన గడువు పూర్తి అయే లోపల కెంపు కస్తూరి చేత రోజూ స్నానం చేయించింది. ఆమె స్నానం చేసిన నీరు తొట్లలో పట్టి ఉంచితే దాని పైన కస్తూరి

తేలేది. ఇలా రోజుల తరబడి తయారైన కస్తూరి కోడిగుడ్డంత సిద్ధం చేసి, అబ్దుల్లా దాన్ని తీసుకుపోయి సుల్తాను కిచ్చాడు. సుల్తాను దాన్ని తన కుమార్తె కిచ్చి, "నీ చివరి కోరిక కూడా తీరిపోయింది. ఇక ఆలశ్యం లేకుండా వజీరు కొడుకును పెళ్ళాడు," అన్నాడు.

"నా కోరికలు తీరటానికీ వజీరు కొడుక్కూ ఏమిటి సంబంధం? నా కోరికలు తీర్చినవాణ్ణే పెళ్ళాడతానని మొదటి నుంచీ స్పష్టంగా చెబుతున్నాను. నన్ను అబ్దుల్లా కిచ్చి పెళ్ళి చెయ్యండి," అన్నది సుల్తాను కుమార్తె.

"ముగ్గురు పెళ్ళాలున్న సామాన్య వర్తకుడిని పెళ్ళాడతావా?" అన్నాడు సుల్తాను.

"అతని భార్యలందరూ సముద్రకన్యలు. వారికి దాసిగా ఉండటానికి కూడా నేను తగను. వారి అనుగ్రహంతోనే నేను అబ్దుల్లాను పెళ్లాడగలను. అతను సామాన్య వర్తకుడా? ఏ సామాన్యవర్తకుడు నేను కోరిన వస్తువులు తెచ్చి ఇవ్వగలడు? మీరు గొప్పవాడనుకునే వజీరు కొడుకు తెగలిగాడా?" అన్నది సుల్తాను కుమార్తె.

ఆమెకు జవాబు చెప్పలేక సుల్తాను అబ్దుల్లాను పిలిపించి, "నా కుమార్తెను పెళ్ళాడు," అన్నాడు.

"నా ముగ్గురు భార్యలూ అనుమతిస్తే గాని మీ కుమార్తెను పెళ్ళాడలేను," అన్నాడు అబ్దుల్లా.

సుల్తాను సముద్రకన్యలకు అంతులేని కానుకలు తీసుకుపోయి, వారిని బతిమాలిన మీదట వారు అబ్దుల్లా వివాహానికి అనుమతి ఇచ్చారు. అబ్దుల్లాకూ, సుల్తాను కుమార్తెకూ వివాహం జరిగిపోయింది.

అబ్దుల్లా తన భార్యలను నలుగురినీ సమంగా చూసుకుంటూ సుఖంగా కాలక్షేపం చేసి, సుల్తాను పోయిన అనంతరం తానే సుల్తాను అయి, జనరంజకంగా పాలించాడు.






అన్నం దానాత్పరం దానం, విద్యాదాన మతః పరం
అన్నేన క్షణికా తృప్తిః, యావజ్జీవంచ విద్యయా. 1.

దానాలన్నిటిలోకీ అన్నదానం గొప్పది. దానిని మించినది విద్యాదానం. అన్నం తాత్కాలికం గానే తృప్తినిస్తుంది. విద్య యావజ్జీవం తృప్తినిస్తుంది.

సంపూర్ణ కుంభో నకరోతి శబ్దం, అర్ధోఘటో శేష ముపైతి నూనం ;
విద్వాన్ కులీనో నకరోతి గర్వం, గుణైర్విహీనా బహు జల్పయంతి. 2.

నిండుకుండ చప్పుడు చెయ్యదు. సగం ఖాళీగా ఉన్న కుండ చప్పుడు చేస్తుంది. కులీనుడైన విద్వాంసుడు గర్వించడు. గుణహీనులే ఎక్కువగా వదరుతారు.

రూప యౌవన సంపన్నాః, విశుద్ధ కుల సంభవాః
విద్యాహీనాః న శోభంతే, నిర్గంధా ఇవ కింశుకాః. 3.

రూపమూ, యౌవనమూ, కులమూ ఉన్నప్పటికీ విద్య లేనివారు సువాసనలేని మోదుగు పువ్వుల్లాగా రాణించరు.

పరం పలిత కాయేన కర్తవ్యః శ్రుతసంగ్రహః ;
నతత్ర ధనినో యాన్తి యత్ర యాన్తి బహుశ్రుతాః. 4.

వార్ధక్యంలో కూడా జ్ఞానం సంపాదించాలి. బాగా చదువుకున్నవారు వెళ్ళే చోటికి ధనికులు పోలేరు.




# సింద్‌బాద్ అద్భుతయాత్రలు

కష్టాలు సంప్రాప్తమైనప్పుడు అవి తీరిన దాకా ఆరాటపడటమూ, తీరిపోయాక వాటిని తలుచుకుని ఆనందించటమూ మానవ స్వభావం. కష్టాలు సంభవించిన సమయంలో కలిగిన భయమూ, ఆందోళనా, వెనక్కు తిరిగి చూసుకుంటే అర్థం లేనివిగా కనిపిస్తాయి.

సింద్‌బాద్‌కు అలాగే అనిపించింది. అతను మూడుసార్లు సముద్రాల మీద వెళ్లి యమయాతనలు పడ్డాడు. అయినా, తీరి కూర్చుని సమస్త సుఖాలూ అనుభవించటంలో జీవితం లేనే లేదనీ, ప్రపంచం తిరిగి, కొత్త కొత్త అనుభవాలు సంపాదించటమే జన్మ సాఫల్యమనీ అతనికి తోచసాగింది. ఇంకా డబ్బు సంపాదించటం కూడా పురుష లక్షణమే ననిపించింది.

ఒక్క ముక్కలో చెప్పాలంటే అతని కాళ్లు మళ్ళీ దురదపెట్టాయి. అందుచేత అతను దైవప్రేరితుడి లాగా, బంధుమిత్రులనూ, సమస్త సుఖాలనూ వదిలేసి పూర్వం కన్న విలువగల వర్తకపు సరుకులు కొని, వాటితో బస్రా చేరాడు. అక్కడ మరి కొందరు బస్రా వర్తకులతో బాటు ఒక పెద్ద ఓడలో ఎక్కి సముద్రం మీద ప్రయాణమైనాడు. అది మంచి వేగం గల ఓడ.

ఓడ చాలా రేవులు చూసింది. అది నిలిచిన చోటనల్లా వర్తకం చురుకుగానూ, లాభసాటిగానూ సాగింది. అయితే ఒకనాడు సరంగు నట్టనడి సముద్రంలో లంగరు దింపించి, "మనకు పెద్ద ఆపదే వచ్చి పడింది," అన్నాడు.

అతనా మాట అన్న సమయంలో బ్రహ్మాండమైన ఉప్పెనగాలి వీచింది. తాడి ప్రమాణాన సముద్ర కెరటాలు లేచి, అనేక వేల ఏనుగుల బలంతో ఓడను బాదనారంభించాయి. ఆ తాకిడికి తట్టుకోలేక ఓడ,

నాలుగవ యాత్ర



లేచి, తీరం నుంచి దూరంగా భూప్రాంతానికి బయలుదేరారు. కొంత దూరం వెళ్లాక అల్లంత దూరాన వారి కొక భవనం కనిపించింది. అంతలోనే ఆ భవన ద్వారంలో నుంచి, కారునలుపు మనుషులు, బట్టలకు మారుగా చర్మాలు ధరించినవాళ్ళు, పరిగెత్తుకుంటూ వచ్చి వర్తకులను కలుసుకుని, మాటా పలుకూ లేకుండా వారిని భవనంలోకి తీసుకుపోయారు.

ఆ భవనంలో ఒక విశాలమైన సావడి ఉన్నది. అందులో ఎత్తయిన సింహాసనం మీద ఒక రాజు కూర్చుని ఉన్నాడు. సింద్‌బాద్‌నూ, అతని అనుచరులనూ కూర్చోమని ఆ రాజు సైగ చేశాడు. అందరూ కూర్చున్నాక నల్లటివాళ్లు కంచాలలో భోజనాలు తెచ్చి, అందరి ముందూ ఉంచారు. ఆ భోజనంలో ఉన్న పదార్థా లేమిటో కూడా సింద్‌బాద్‌కు అంతుపట్టలేదు. వాటిని చూస్తుంటే అతనికి నోట పెట్టుకో బుద్ధి కాలేదు. కాని మిగిలినవాళ్లు ఆకలి కొద్దీ ముందూ వెనకా ఆలోచించకుండా తమ ముందున్న ఆహారాన్ని అవురావురని తినేశారు. వాళ్ళా ఆహారాన్ని తినే పద్ధతి చూస్తున్నకొద్దీ సింద్‌బాదుకు పశువులు మేత మేయటం జ్ఞాపకం వచ్చింది.

వర్తకులతోనూ, వారి సరుకులతోనూ సహా సముద్రంలో మునిగిపోయింది. సింద్‌బాదూ, మరి కొందరు వర్తకులూ అదృష్టవశాన ఒక చెక్కల తెట్టును పట్టుకుని, దాని సహాయంతో ప్రాణాలు కాపాడుకున్నారు. వారిని కెరటాలు ఒక పూటల్లా బంతి ఆడినట్టు ఆడించాయి. చివరకు గాలి వారిని ఏదో తీరానికి తెచ్చి పారేసింది. ఉప్పెన దెబ్బకు ప్రాణాలు మూడువంతులు చచ్చి ఉండటాన, ఎట్లా పడినవాళ్ళు అట్లాగే ఇసుకలో నిద్రపోయారు.

ఆ రాత్రి గడిచి తెల్లవారేసరికి వాళ్ళు కొంచెం తేరుకున్నారు. అందుచేత వాళ్ళు

సింద్‌బాద్ అనుచరులు భోజనం చేస్తూం డగానే నల్లవాళ్ళు జాడీలతో ఏదో లేపనం తెచ్చి, తినేవాళ్ళ శరీరాలకు పూయసాగారు. అలేపనం మహిమ ఏమిటోగాని ఒక్కొక్కడి పొట్టా చూస్తుండగానే ఉబ్బకు రాసాగింది. పొట్టలు పెరిగే కొద్దీ వాళ్ళ ఆకలీ పెరుగు తున్నట్టు కనబడింది.

సింద్‌బాద్ ఆ భోజనాన్ని తాకలేకపోవటం మేలయింది. నల్లవాళ్ళు అతని శరీరానికి కూడా లేపనం పూయవచ్చారు, కాని అతను ఒప్పుకోలేదు. ఈ నల్లవాళ్ళు నరభక్షకులనీ, తన అనుచరులను కొవ్వెక్కే లాగా తిని పించి, తరవాత కోసుకు తింటారనీ అతనికి త్వరలోనే తెలియవచ్చింది. నల్లవాళ్ళు పచ్చిమనుషులను పీక్కుతింటారు; వాళ్ళ రాజు మాత్రం రోజుకొక మనిషిని కాల్చుకు తింటాడు!

తన అనుచరుల మీద అతను ఆశలు వదులుకున్నాడు. పొట్టలు పెరిగేకొద్దీ వారి మెదడు తరిగిపోతున్నట్టు స్పష్టమయింది. చివరకు నల్లవాళ్ళు వాళ్ళను మేపటానికి పచ్చిక మైదానాల మీదికి తోలుకుపోవటం కూడా సింద్‌బాద్ చూశాడు.

తన గతి ఏమిటన్నదే అతనికి అర్థం కాలేదు. అసలే బక్కమనిషి, ఆకలితోనూ, భయంతోనూ మరింత చిక్కి, ఎముకల





గూడు లాగా అతను తయారయాడు. ఆ నల్ల వాళ్ళు అతన్ని గురించి ఏ మాత్రమూ పట్టించుకోలేదు. అందుచేత అతను ఒక నాడు ఆ భవనం దాటి, దీవికి అడ్డంపడి నడవసాగాడు. తన అనుచరులను తోలుకు పోతూ నల్లవాళ్ళు ఎదురయితే అతను ఒక చెట్టు చాటుకు తప్పుకున్నాడు.

సింద్‌బాద్ దారిలో దొరికిన దుంపలూ అవీ తింటూ ఆరు రోజులపాటు నడిచి, చివరకు మానవులుండే చోట వచ్చి పడ్డాడు. ఆ ప్రాంతంలోనే దీవి అవతలి తీరం ఉన్నది. అక్కడి మనుషులు సింద్‌బాద్ మాట్లాడే భాషే మాట్లాడుతున్నారు. వారి భాష వినగానే అతనికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. అతను వారితో తన కష్టాలన్నీ చెప్పుకున్నాడు. వారు అతనికి భోజనం పెట్టారు. అతను విశ్రాంతి తీసుకున్న అనంతరం వాళ్ళు అతన్ని పడవ మీద, తమ రాజుగారుండే మరొక దీవికి తీసుకుపోయారు.

రాజధానీ నగరం నాగరీకంగా ఉన్నది. జనసంఖ్య జాస్తి. వీధులు విశాలంగానూ, శుభ్రంగానూ ఉన్నాయి. జనం జీనుల్లేని గుర్రాల మీద స్వారీ అయి వీధుల వెంట వెళుతున్నారు. అది చూసిన సింద్‌బాద్ రాజుగారిని దర్శనం చేసుకుంటూనే, "మీ పౌరులు జీనులు లేకుండా గుర్రాల మీద స్వారీ చేస్తారెందుకని?" అని అడిగాడు.

"జీనులంటే ఏమిటి? వాటిని మే మెరగమే!" అన్నాడు రాజు.

"తమ అనుమతి అయితే రెండు రోజుల్లోపల జీను ఒకటి తయారు చేసి చూపుతాను. దానివల్ల ఎంత వీలున్నదీ తమకే తెలుస్తుంది," అన్నాడు సింద్‌బాద్.

రాజుగారి అనుమతి పొంది, ఒక వడ్రంగి చేత అతను కొయ్యా జీను తయారు చేయించాడు. దాని మీద అమర్చటానికి ఈకలు కూరిన మెత్త తయారు చేయించి, దానికి తోలు తొడుగూ, జలతారు అంచులూ,

రంగుల కుచ్చులూ అమర్చాడు. తరవాత ఒక కమ్మరి చేత కళ్ళెం తగిలించే ఇనప ముక్కా, కాళ్ళు పెట్టుకునే రికాబులూ చేయించాడు.

తరవాత సింద్‌బాద్ గుర్రాలుండే చోటికి వెళ్ళి, ఒక మంచి గుర్రాన్ని ఏరి, దానికి కళ్ళెమూ, జీనూ అమర్చాడు; దాని మెడకు నీలం కుచ్చులు పెట్టి, దాన్ని తీసుకుపోయి రాజుగారి ముందు పెట్టాడు. రాజుగారు ఆ గుర్రాన్ని ఎక్కి స్వారీ చేసి, జీను వల్లా, కళ్ళాల వల్లా కలిగే సదుపాయం గ్రహించి, సింద్‌బాద్‌కు ఎంతో ధనమూ, కానుకలూ బహూకరించాడు.

రాజుగారి అనంతరం మంత్రిగారు కూడా తన గుర్రానికి సింద్‌బాద్ చేత జీను ఏర్పాటు చేయించుకున్నాడు. అది మొదలు నగరంలో ఉన్న గొప్పగొప్ప వాళ్లంతా తమ గుర్రాలకు జీనులు ఏర్పాటు చేయించుకుని, సింద్‌బాద్‌కు అంతులేని కానుకలిచ్చి, అతన్ని గొప్ప ధనికుణ్ణి చేశారు.

రాజుగారికీ, సింద్‌బాద్‌కూ గొప్ప స్నేహం కుదిరింది. ఆ స్నేహాన్ని పురస్కరించుకుని రాజుగారు సింద్‌బాద్‌కు ఒక సంబంధం చూశాడు. అతన్ని పెళ్ళిచేసి కట్టి పడేస్తే, అక్కడే ఉండిపోతాడని రాజుగారి ఉద్దేశం. సింద్‌బాద్‌కు తల తిరిగినట్టయింది; కాని





రాజుగారి మాటకు ఎదురు చెప్పలేక సరే నన్నాడు. వధువు చాలా చక్కనిదీ, సంపన్నురాలు కూడానూ. ఈ దంపతులు ఉండటానికి ఒక దివ్యమైన భవనమూ, వారికి సేవ చెయ్యటానికి దాసదాసీ జనాన్నీ ఏర్పాటు చేశాడు రాజు.

సిందబాద్ తన భార్యతో చాలా అన్యోన్యంగా అనేక మాసాలపాటు కాపరం చేశాడు. తాను బాగ్దాదుకు పోయే అవకాశం చిక్కినప్పుడు ఆమెను తన వెంట తీసుకు పోదామని కూడా అతను అనుకున్నాడు.

ఒకనాడు సిందబాద్ పొరుగున ఉన్న పెద్దమనిషి భార్య చనిపోయింది. సిందబాద్ అతన్ని పరామర్శించటానికి వెళ్ళి, "విచారించకండి. ఈసారి మీకు ఇంతకన్న కూడా యోగ్యురాలైన భార్య దొరక వచ్చు," అన్నాడు.

"కొద్ది గంటలలో చచ్చిపోయే వాడికి ఇంకో భార్య ఏమిటి?" అన్నాడా మనిషి.

ఆ మాట అప్పుడు సిందబాద్‌కు ఏమీ అర్థం కాలేదు. కాని త్వరలోనే అతను నిజం తెలుసుకున్నాడు. భార్యాభర్తలలో ఎవరు పోయినా ఇద్దరినీ కలిపి పూడ్చెయ్యటం అక్కడి ఆచారం. అది తెలిసి సిందబాద్ చాలా చీదరించుకున్నాడు. అతను చూస్తూండగానే పొరుగింటి వాడు తన భార్య శవం వెనకగా శ్మశానానికి వెళ్ళాడు. నదీ తీరాన ఒక కొండ మీద చాలా లోతైన బావి ఉన్నది. శవంతోబాటు, చనిపోయిన స్త్రీ భర్తను కూడా ఆ బావిలోకి దింపి, బావి మీద బండరాయిని కప్పేశారు.

ఈ అమానుషమైన ఆచారం పరదేశీయులకు కూడా వర్తిస్తుందా అని సిందబాద్ రాజు నడిగితే, వర్తిస్తుందని ఆయన చెప్పాడు. సిందబాద్‌కు కడుపులో చెయ్యి పెట్టి కెలికినట్టయింది. తన భార్యకన్న తానే ముందు చస్తానని అతను తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు.



కాని అలా జరగలేదు. కొద్ది రోజులకే సింద్‌బాద్ భార్యకు జబ్బు చేసి, మంచాన పడి, చివరకు మరణించింది. అతని నెత్తిన పిడుగుపడ్డట్టయింది. రాజుగారు తన విషయంలో ఆచారాన్ని దాట వేస్తాడన్న ఆశ కూడా పోయింది — రాజుగారు స్వయంగా వచ్చి, చచ్చిపోబోతున్నందుకు అతని పట్ల సానుభూతి సంతాపాలు తెలిపి, ఎంతగానో విచారించాడు.

సింద్‌బాద్ భార్య శవాన్ని నగలతో అలంకరించి, పేటికలో పెట్టి కొండ వద్దకు చేర్చారు. శవం వెనక సింద్‌బాద్‌తోబాటు రాజుగారూ నడిచాడు. తనకు తన దేశంలో భార్యా, బిడ్డలూ ఉన్నారనీ, వాళ్ళు తన కోసం ఎదురు చూస్తూ ఉంటారనీ సింద్‌బాద్ మొత్తుకున్నాడు. కాని అది అరణ్యరోదనమయింది.

ముందు శవపేటికను బావిలో దించారు. తరవాత అతని చంకల కిందుగా తాళ్లుకట్టి, ఆ తాళ్ళకే ఒక నీరు గల కూజా, ఏడు రొట్టెలూ కట్టి, సింద్‌బాదును కూడా బావిలోకి దించారు. అతను తాళ్ళు ఊడదీసి నాక పై నున్న వాళ్ళు వాటిని పైకి లాక్కుని, బావి మీద రాయి మూసి, తమ దారిన తాము వెళ్లిపోయారు.



బావి దిగువన చాలా విశాలమైన గుహ లాగా ఉన్నది. అంతో ఇంతో వెలుతురు లోపలికి వస్తున్నది. సింద్‌బాద్ తాను ఇంటి నుంచి బయలుదేరినందుకూ, సముద్రంలో మునిగి చావనందుకూ విచారించాడు.

అతన్ని ఆకలీ, దప్పీ బాధించసాగాయి. కాని సాధ్యమైనంత కాలం బతికి ఉండాలనే ఆశతో అతను నీటినీ రొట్టెనూ చాలా పొదుపుగా ఖర్చుచేశాడు. రాత్రివేళ పడుకునేటందుకు చోటు ఏర్పాటుచేసుకున్నాడు. క్రమంగా నీరూ, రొట్టెలూ అయిపోయాయి. ఇక చావు కోసం ఎదురుచూడటం తప్ప అతను చేయగలిగినది ఏమీ లేదు.



ఈ స్థితిలో ఒక చిత్రం జరిగింది. అతను నిద్రపోతూండగా ఏదో శబ్దానికి మెలకువ వచ్చింది. నిద్రలేచాక శ్వాస వినిపించింది. తరవాత ఏదో జంతువు పారిపోతున్న చప్పుడయింది. అతను సాహసించి ఆ పారిపోయే జంతువును తరుముతూ, ఎగుడు దిగుడు నేలమీద పడుతూ లేస్తూ పరిగెత్తాడు. కొంత దూరం వెళ్ళాక అతని కంటికి నక్షత్రం కనిపించింది. అదొక బిలం. శవాలను తినే నక్కలో, తోడేళ్లో ఆ బిలం కుండా వస్తున్నాయన్నమాట.

సింద్‌బాద్ ఆ బిలంలో నుంచి దూరి అవతలికి వెళ్ళేసరికి, పైన ఆకాశమూ వెలిగిపోతున్న నక్షత్రాలూ కనబడ్డాయి. అతను మోకరించి భగవంతుడికి ధన్యవాదాలు తెలుపుకున్నాడు. తరవాత మళ్ళీ గుహలోకి వెళ్ళి, శవాలకుండిన నగలన్నీ ఒలిచి మూట కట్టుకుని తిరిగి వచ్చాడు. కొండ అవతలి పక్క సముద్రం ఉన్నది. ఆ సముద్రతీరాన అతను మకాం పెట్టి, ఏదన్నా ఓడ కనిపిస్తుందేమో నని ఎదురు చూడసాగాడు.

కొద్దిరోజులకు అటుగా ఒక ఓడ రానే వచ్చింది. ఓడలోవాళ్ళు అతన్ని గమనించి సమీపంగా వచ్చారు. అతను నగలమూటతో సహా ఓడలోకి ఎక్కి, తాను ఓడ పగిలిన ప్రయాణీకుణ్ణని సరంగుతో చెప్పాడు. సరంగును మంచి చేసుకుందామని అతను తన నగలమూటలో నుంచి మంచివి ఏరి ఇవ్వబోయాడు గాని, సరంగు తీసుకోలేదు; "అపాయం నుంచి రక్షించినవాళ్ళ దగ్గిర నేను కేవు పుచ్చుకోను," అన్నాడు. అతని ధర్మబుద్ధికి సింద్‌బాద్ చాలా సంతోషించాడు.

కాలక్రమాన ఓడ బస్రా చేరింది. సింద్‌బాద్ ఆ నగరంలో కొద్ది రోజులుండి, నదీ ప్రయాణం చేసి బాగ్దాదు చేరాడు. అతన్నీ, అతను తెచ్చిన నగలనూ చూసి అతని బంధువులు పరమానందభరితులయారు.





# మహాభారతం

## 12. బకాసురవధ

తమకు ఆశ్రయం ఇచ్చిన బ్రాహ్మణుడి కుటుంబంవారు ఎందు కేడుస్తున్నారో తెలుసుకుందామని కుంతీదేవి వచ్చినాక బ్రాహ్మణుడు దుఃఖంతో ఇలా పెద్దగా విలపించసాగాడు:

"ఈ ప్రపంచంలో పెళ్ళాం, బిడ్డలతో సుఖంగా జీవించే మార్గం లేదుగద! ఈ దిక్కుమాలిన ఊరు వదిలిపోదామని నా భార్యతో ఎన్నడో అన్నాను. తాను ఇక్కడే పుట్టాననీ, ఇక్కడే పెరిగాననీ, తన కన్న వారికి దూరంగా పోలేననీ అన్నది. వాళ్ళు, ఏ నాడో చనిపోయారు. ఈ ఊళ్ళోనా, బంధువన్నవాళ్ళు ఒక్కరూ లేరు. అయినా ఈ వూరు వదిలిపెట్టాము కాము! అప్పుడే నా మాట విన్నట్టయితే ఇప్పుడీ ఆపద వచ్చి పడేది కాదు. ఇప్పుడు మనం ఏం చేసేటట్టు? ఆ రాక్షసుడి వాత ఎవరిని వెయ్యను? ఇంతకాలమూ నాకు అనుకూలవతివిగా ఉండి, నా వల్ల సంతానం కన్న నిన్ను రాక్షసుడి పొట్టన పెట్టనా? లేక వంశాంకురంగా పుట్టి పెరుగుతున్న మన కొడుకును పంపనా? కన్యాదానం చెయ్యవలిసిన కూతురిని పంపనా? అందుచేత రాక్షసుడికి ఆహారంగా నేనే పోతాను. అంతకన్న మార్గం లేదు."

బ్రాహ్మణుడి భార్య ఇందుకు ఒప్పుకోలేదు. తన భర్త చనిపోతే తనకూ, పిల్లలకూ రక్షణ ఉండదనీ, తాము లోకులకు లోకువై పోతామనీ, పిల్లల భవిష్యత్తు తీర్చిదిదే శక్తిసామర్థ్యాలు తనకు లేవనీ, అందు



చేత తానే రాక్షసుడికి ఆహారమవుతాననీ ఆమె అన్నది. ఆమె ఒక ఆశ కూడా కనబరిచింది. అదేమిటంటే, తాను ఆహారంగా వెళ్ళితే, స్త్రీ హత్యకు జంకి రాక్షసుడు తనను విడిచిపుచ్చ వచ్చునని!

ఈ మాట విని బ్రాహ్మణుడు తన భార్యను కౌగలించుకున్నాడు. ఇద్దరూ పెద్ద పెట్టున ఏడవ నారంభించారు.

వాళ్ళను చూసి కూతురు, "మీ రిద్దరూ ఎందుకు వృథాగా ఏడుస్తారు? రాక్షసుడికి నన్ను ఆహారంగా పంపెయ్యండి. నే నెలాగూ ఎప్పటికైనా మీకు దూరంగా వెళ్లేదాన్నే గద! అందుచేత నన్ను పంపేస్తే మీకు కలిగే నష్టమేమీ లేదు. పైపెచ్చు మీకు ప్రమాదం తప్పిపోతుంది," అన్నది.

అప్పుడు అయిదేళ్ళ వయసుగల కుర్రవాడు చిన్నపుల్ల తీసుకుని, అటూ ఇటూ ఉత్సాహంగా తిరుగుతూ, వచ్చీరాని మాటలతో, "ఆ రాక్షసుణ్ణి నేను చంపేస్తానుగా! ఏడవకండి," అన్నాడు. వాడి మాటలకు పెద్దవాళ్ళు అంత దుఃఖంలోనూ నవ్వారు.

ఇదంతా వింటున్న కుంతి వారికి మరింత దగ్గరగా వచ్చి బ్రాహ్మణుడితో, "అయ్యా, మీ కిప్పుడు వచ్చిన ఆపద ఏమిటి? నాకు వివరంగా చెప్పినట్టయితే చెయ్యదగిన సహాయం చేస్తాను," అన్నది.

దానికి బ్రాహ్మణుడు కుంతితో, "అమ్మా, మీ మంచితనం కొద్దీ మీరలా అన్నారు గాని, మాకు వచ్చిన విపత్తు మానవమాత్రులు తీర్చేది కాదు. ఈ నగరానికి సమీపంలో బకు డనే నరభక్షకు డొక డున్నాడు. వాడు రోజూ నరమాంసం తింటూ మదించి ఉన్నాడు. ఈ ఊరికి వాడు రక్షకుడుగా ఉంటున్నందుకు గాను, ఊరివాళ్ళు రోజు కొక ఇంటి వంతున ఆ రాక్షసుడికి ఇరవై బారువల అన్నమూ, రెండు ఎనుబోతులూ, ఒక మనిషినీ పంపాలి. ఎవరన్నా అలా చెయ్యని రోజున ఆ రాక్షసుడు ఊరి మీద



పడి ప్రజను చెండుకు తింటాడు. ఈ దేశపు రాజు వేత్రకీయగృహ మనేచోట ఉంటు న్నాడు. ఈ రాక్షసుడి బెడద నుంచి ప్రజలను కాపాడే ప్రయత్నమేదీ ఆయన చేయడు. ఆయన అసమర్థుడు. అసమర్థుడి పాలనలో ఉన్న మాకు రోజూ ఈ ఆపద ఉంటూనే ఉన్నది. ఇవాళ మా ఇంటి వంతు వచ్చింది. మాకే రాజాశ్రయం ఉండి, ధనవంతులమై ఉంటే ఎవడినన్నా మనిషిని కొని, వాణ్ణి రాక్షసుడికి ఆహారంగా పంపి ఉందుము. అందుచేత మా కుటుంబానికి ఈ ఆపద తప్పదు. ఒకరిని విడిచి ఒకరం బతక లేము. నలుగురమూ ఒక్కసారే వెళ్లి ఆ రాక్షసుడికి ఆహారమవుతాం," అన్నాడు.

కుంతి ఈ కథ అంతా విని, "అయ్యా, మీరు నిశ్చింతగా ఉండండి. ఇవాళ ఆ రాక్షసుడికి ఆహారంగా నా కొడుకును పంపు తాను. వాణ్ణి రాక్షసుడు చంపలేడు. వాడే ఆ రాక్షసుణ్ణి చంపేస్తాడు. వాడు చాలా బలవంతుడు. అదీగాక వాడి దగ్గిర మంత్ర శక్తులున్నాయి. అందుకే పంపిస్తున్నాను గాని, నిజంగా, నా కొడుకును రాక్షసుడు తినాలని ఎంతమాత్రమూ కాదు. ఏ తల్లి అయినా, నూరుగురు కొడుకు లున్నప్పటికీ, తన కొడుకును మృత్యుదేవతకు చేజేతులా



బలిచేస్తుందా? అందుచేత మీరు ఈ ఏర్పాటుకు ఒప్పుకోండి. ఈ సంగతి మాత్రం ఊళ్ళో ఎవరికీ తెలియనివ్వకండి. వాడి గురువుగారికి తెలిసి, ఆయన వీలు లేదన్నాడంటే, నా కొడుకు రాక్షసుణ్ణి చంపే అవకాశం కూడా పోతుంది," అన్నది.

కుంతి మాటలలో బ్రాహ్మణుడికి గురి కుదిరింది. ఆయనకు ఆపద తప్పిందన్న ఆనందమూ, కుంతి తనకు మహోపకారం చేసినందుకు కృతజ్ఞతా కూడా కలిగాయి. కుంతి భీముడితో సంగతంతా చెప్పింది. భీముడు తల్లి చేసిన ఏర్పాటుకు సమ్మ తించాడు.



ఇంతలో మిగిలిన నలుగురు పాండవులూ భిక్ష తీసుకుని ఇంటికి తిరిగివచ్చారు. భీముడు మహా ఆనందంలో ఉండటం గమనించి ధర్మరాజు కుంతిని రహస్యంగా, భీముడి ఆనందానికి కారణమేమిటని అడిగాడు. కుంతి అతనితో సంగతంతా చెప్పి, "ఇన్నాళ్ళకు మనం ఇల్లుగల బ్రాహ్మణ కుటుంబానికి ప్రత్యుపకారం చేసే అవకాశం దొరికింది," అన్నది.

ఈ మాట విని ధర్మరాజు చాలా బాధపడ్డాడు; తమ తల్లి తొందరపడిందనుకున్నాడు. పాండవుల ఆశలన్నీ భవిష్యత్తు అంతా భీముడి భుజబలం మీదే ఆధారపడి



ఉన్న సంగతి అతనికి తెలుసు. రేపు వారు కౌరవులను జయించి తమ రాజ్యం తాము తీసుకోదలిస్తే భీముడు లేకుండా ఎలా సాధ్యం? దుర్యోధనుడు కుట్రతో తమనందరినీ లక్కయింట కాల్చి చంపటానికి యత్నించినప్పుడు అందరినీ ఆపద నుంచి తప్పించటం ఒక్క భీముడి వల్ల గనక అయింది గాని మరొకరి వల్ల సాధ్యమా?

ధర్మరాజు ఈ ధోరణిలో మాట్లాడుతూ ఉంటే కుంతీదేవి వ్యతిరేకించింది. అర్తులను రక్షించటం ఉత్తమ క్షత్రియధర్మం. ఈ బ్రాహ్మణ కుటుంబానికి ప్రత్యుపకారం చెయ్యకపోతే అది మహాపాతకం. భీముడికి వచ్చిన భయమేమీ లేదు. అతను ఎలాటి రాక్షసుడినైనా చంపగలడు. తాను చేసిన ఆలోచన ఇహానికీ, పరానికీ కూడా పనికి వచ్చేదని ఆమె అన్నది. ధర్మరాజు తల్లి అభిప్రాయంతో చివరకు ఏకీభవించక తప్పలేదు.

ఆ రాత్రి గడిచి తెల్లవారగానే భీముడు ఇల్లుగల బ్రాహ్మణుడితో, "అయ్యా, తెల్లవార్లూ నాకు నిద్రలేదు. అకలి దహిస్తున్నది. నాకు మంచి ఆహారం కడుపునిండా పెట్టించారంటే రాక్షసుడితో ఉత్సాహంగా పోరాడతాను," అన్నాడు. బ్రాహ్మణుడు అతనికి



తిన్నంతగా భక్ష్యభోజ్యాలూ, పానీయాలూ, నెయ్యీ, పెరుగూ పెట్టించాడు.

తరవాత భీముడు ఒక బండికి రెండు దున్నలను కట్టి, బండి నిండా అన్నపు రాసులు పోసుకుని, నగరానికి దక్షిణంగా వెళ్ళి, బకు డుండే చోటికి చాలాదూరంగా, యమునానది ఒడ్డున బండి నిలిపి, తన దగ్గిరికి రమ్మని బకుణ్ణి కేకలుపెట్టి, వాడు వచ్చేలోగా ఊరికే ఉండటం దేనికని బండిలో ఉన్న ఆహారాన్ని తింటూ కూర్చున్నాడు.

ఒక సామాన్య మానవుడు తనను పిలుస్తూ ఉండటం చూసి బకుడు మండి పడి పరిగెత్తుకుంటూ వచ్చి, తన కోసం ఏకచక్రపురం వాళ్ళు పంపిన అన్నాన్ని భీముడు పెద్ద పెద్ద ముద్దలు చేసి మింగు తూండటం చూసి, "ఎవడురా వీడు? చావబోతూ కూడా నిశ్చింతగా మెక్కు తున్నాడు!" అన్నాడు.

భీముడు బకుడి కేసి చూసి ఒక నవ్వు నవ్వి తిరిగి యథాప్రకారం తన తిండిలో నిమగ్నుడయాడు. బకుడు పెద్ద పెడబొబ్బ పెట్టి, భీముణ్ణి చంపేవాడల్లే రెండు చేతులూ ఎత్తి భీముడి మీదికి వచ్చాడు. దానికి కూడా భీముడు చలించక, బండిలోని అన్నం తింటున్నాడు. తన పెడబొబ్బకు





కూడా ఆ మనుష్యమాత్రుడు చలించక పోవటం చూసి బకుడు భీముడి వీపును తన రెండు చేతులతోనూ చరిచాడు. దాన్ని కూడా భీముడు లక్ష్యపెట్టక, తిండి పూర్తి చేసి, వెళ్ళి నదిలో చేతులూ, కాళ్ళూ కడుక్కొంటున్నాడు. బకుడు ఆగ్రహావేశంతో ఒక చెట్టు పీకి, భీముడి కేసి విసిరాడు.

భీముడు కడుపునిండా నీరుతాగి బకుడితో యుద్ధానికి సన్నద్ధుడై వచ్చాడు. బకుడు విసిరిన చెట్టు భీముడి చేతిలోనే ఉన్నది. వాడు మరో చెట్టు పీకి విసిరేసరికి భీముడు తన చేతిలో ఉన్న చెట్టును దానికి అడ్డం పెట్టి ఆపాడు. చుట్టుపక్కల ఉన్న చెట్లన్నీ అయిపోయే దాకా ఇద్దరూ ఈ విధంగా చెట్లతో యుద్ధం చేసుకున్నారు.

తరవాత బకాసురుడు తన చేతులతో భీముణ్ణి పట్టుకున్నాడు. ఇద్దరూ మల్ల యుద్ధం చేస్తూ ఒకరినొకరు విసిరివేశారు, జరజరా ఈడ్చారు. చివరకు భీముడు బకాసురుణ్ణి పడదోసి, మీద ఎక్కి కూర్చుని, భూమికి అదిమి పెట్టి, మోకాళ్ళతోనూ, చేతులతోనూ కుమ్ముతూ, మెడా, నడుమూ, వీపూ విరగ బొడిచాడు. బకాసురుడు భయంకరంగా నెత్తురు కక్కుతూ చచ్చాడు.

వాడు పెట్టిన చావుకేక విని వాడి బంధువులు వచ్చారు. భీముడు వాళ్ళను చూసి, "ఇకముందు మీలో ఎవరన్నా తిండి కోసం మనుషులను చంపారంటే, వాళ్ళకు కూడా ఈ బకుడికి పట్టిన గతే పట్టుతుంది, జాగ్రత్త!" అని హెచ్చరించాడు. వాళ్ళు వణికిపోతూ తమ తమ చోట్లకు వెళ్ళిపోయారు.

భీముడు బకుడి శవాన్ని ఈడ్చుకు వచ్చి నగరద్వారం దగ్గిర పెట్టి, నదిలో స్నానం చేసి, ఇంటికి తిరిగి వెళ్ళిపోయి, జరిగిన సంగతి ధర్మరాజుకు తెలిపాడు.

బకుడి శవం ఊరివారి కంట పడింది. రాక్షసుడు చచ్చాడన్న వార్త ఊరంతా



పొక్కింది. వాణ్ణి చంపినదెవరో ప్రజలకు తెలియదు. కాని ఆ పుణ్యాత్ముణ్ణి తెగ మెచ్చుకుని, తమ ఇష్టదేవతలకు దణ్ణాలు పెట్టుకున్నారు. బకుడు చచ్చిననాడు వంతు బ్రాహ్మణుడి ఇంటిదని తెలియగానే అందరూ బ్రాహ్మణుడి వద్దకు వెళ్లి, బకుణ్ణి ఎవరు చంపారని అడిగారు.

తన ఇంట తలదాచుకునేవారిని గురించి బయట పెట్టటానికి వీలులేని కారణంచేత బ్రాహ్మణుడు నగర పౌరులతో, "నిన్న మా ఇంటి వంతు వచ్చింది. నేను పుత్రైడు విచారంలో మునిగి ఉండగా ఒక యోగ సిద్ధుడు వచ్చి, సంగతి విని రాక్షసుడికి ఆహారం తాను తీసుకుపోతాననీ, తనను రాక్షసు డేమీ చేయలేడనీ అన్నాడు. మరి రాక్షసుడు చచ్చాడంటే ఆ మహాత్ముడే ఆ పుణ్యం కట్టుకుని ఉండాలి," అన్నాడు.

ఊరి ప్రజలు పరమానందంతో బ్రాహ్మణోత్సవం చేశారు. కుంతీ, పాండవులూ కూడా ఆ వేడుక చూశారు. వాళ్ళు ఆ బ్రాహ్మణుడి ఇంటనే, అలాగే అజ్ఞాత జీవితం గడుపుతూ వచ్చారు. వారు మధుకరంతోనే జీవించారు.

ఇలా ఉండగా పాండవు లుంటున్న బ్రాహ్మణ గృహానికి ఒక దేశ సంచారి అయిన బ్రాహ్మణుడు అతిథిగా వచ్చి, గృహస్థు ఇచ్చిన ఆతిథ్యం స్వీకరించి, తాను తిరిగిన దేశాలను గురించీ, అక్కడి రాజులను గురించీ అనేక వార్తలు సరదాగా చెప్పుకు పోయాడు. అతను ఒక సందర్భంలో, పాంచాలదేశపు రాజైన ద్రుపదుణ్ణి గురించీ, ఆయనకు శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపదీ పుట్టటం గురించీ, ద్రౌపదీ స్వయంవరానికి జరిగిన ఏర్పాట్లను గురించీ క్లుప్తంగా చెప్పాడు. అప్పుడు కుంతీదేవీ, పాండవులూ కూడా ఆ వృత్తాంతాలను వివరంగా వినగోరారు. అందుచేత బ్రాహ్మణుడు ఇలా చెప్పసాగాడు:





# గాంధీ కథ

## 12

గాంధీ అప్పుడే శాసనోల్లంఘనోద్యమం గురించి ఆలోచించాడు కాని వేల్స్ యువరాజు రాక సందర్భంలో బొంబాయిలో దొమ్మీలు జరగటం చేత విరమించాడు. ఉత్తర ప్రదేశంలోని చౌరిచౌరా వద్ద సత్యాగ్రహులు తమపై అక్రమంగా చెయ్యి చేసుకున్న పోలీసులను సజీవంగా దహనం చెయ్యటంతో గాంధీ సత్యాగ్రహోద్యమాన్నే నిలిపి వేయటం జరిగింది. ప్రజోద్యమాలు శాంతియుతంగా జరగటానికి తగిన వాతావరణం దేశంలో ఉన్నట్టు ఆయనకు తోచలేదు.

గాంధీ ఉద్యమం ప్రారంభిస్తానన్నప్పుడు చాలామంది నాయకులు అభ్యంతరం చెప్పారు. ఆయన దాన్ని విరమించినప్పుడూ అనేకులు ఆక్షేపణ తెలిపారు. వారిలో కొందరికి అహింసలో నమ్మకం లేని మాట కూడా నిజమే. అందుచేత, చౌరీచౌరా సంఘటనను ఆయన సాకుగా పెట్టుకుని సత్యాగ్రహోద్యమాన్ని ఆపాడన్నారు. కాని గాంధీ సిద్ధాంతం ప్రకారం దౌర్జన్య చర్యలు స్వాతంత్ర్యం సాధించటానికి అడ్డంకులు. సత్యాగ్రహసమరంలో వాటికి స్థానంలేదు.

1922 మార్చి 10 న గాంధీని అరెస్టు చేశారు. కారణం ఆయన రచించిన మూడు వ్యాసాలు. విచారణ జరిగేటప్పుడాయన హింసా చర్యల బాధ్యత తన మీదనే వేసుకున్నాడు. గాంధీకి 6 ఏళ్ళు జైలు శిక్ష విధించి పూనా సమీపంలోని ఖిడ్కీ లోని యెరవాడ జైలులో ఉంచారు.

రెండేళ్ళు పూర్తికాకముందే గాంధీకి ఎపెండిసైటిస్ వ్యాధి తీవ్రంగా వచ్చింది. ఆయనకు అపరేషన్ చేశారు. అపరేషను



జరిగిన నెల లోపల. 1924 ఫిబ్రవరి 5 న ఆయనను జైలు నుంచి విడుదల చేశారు.

దేశంలో హిందూముస్లిము సఖ్యత సడలింది. రెండు మతవర్గాల మధ్యా బ్రిటిషు పాలకులు విభేదాలు రెచ్చగొట్టారు. అనేక చోట్ల మతకలహాలు సాగాయి. 1924 సెప్టెంబరులో కోహట్‌లో 155 మంది హిందువులు హతులయారు. గాంధీ 21 రోజులపాటు నిరశనవ్రతం అవలంబించాడు. దాని ఫలితం ఎంతో కాలం ఉండలేదు "హిందూ ముస్లిము సమస్య మనిషి చెయ్యి దాటి దేవుడి చేతుల్లోకి పోయింది," అని ఆయన 1927 లో అన్నాడు.

తరవాత ఆయనకు దేశాన్ని పునర్నిర్మించాలనే ఆలోచన కలిగింది. దేశమంతటా సంచారం చేశాడు. గ్రామోద్ధరణా, ఖాదీ ఉద్యమమూ ఆయనకు ప్రధానంగా తోచాయి.

భారతీయులు స్వరాజ్యానికి అర్హులా కారా అనేది నిర్ణయించటానికి సైమన్ కమిషన్ వచ్చింది. దాన్ని దేశం బహిష్కరించింది. దాని మూలంగా ప్రజలలో రాజకీయ చైతన్యం హెచ్చింది. 1929 డిసెంబరు 30 న కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం చేసింది. ప్రభుత్వానికీ ప్రజలకూ మధ్య ఘర్షణ అనివార్య మయింది. గాంధీ శాసనోల్లంఘనోద్యమాన్ని ఉప్పుసత్యాగ్రహంతో ప్రారంభించాడు. ఆయన కొందరు సత్యాగ్రహులను వెంటబెట్టుకుని అహమ్మదాబాదు నుంచి, సముద్రతీరాన ఉన్న దండికి బయలుదేరాడు. 1930 లో ప్రారంభమైన ఈ శాసనోల్లంఘనోద్యమం దేశవ్యాప్తమైనది. ఈ యేడే ఇంగ్లండులో మొదటి రౌండ్ టేబిల్ సమావేశం జరిగింది. అందులో కాంగ్రెస్ ప్రతినిధులు పాల్గొనలేదు సమస్య అలాగే ఉండిపోయింది.

1931 ఫిబ్రవరి 17 న వైస్రాయి ఇర్విన్‌కూ, గాంధీకీ మధ్య సంప్రతింపులు

ఆరంభమయాయి. ఇద్దరికీ ఒక ఒప్పందం (ఢిల్లీ ఒప్పందం) కుదిరింది. దీని ఫలితంగా కాంగ్రెసు తన ఉద్యమాన్ని నిలుపు చేసింది ప్రభుత్వం రాజకీయ ఖైదీలను విడుదల చేసింది. ఇది కాంగ్రెసు ఆశయాలకు అనుగుణమైన ఒప్పందం కాదు. లండనులో జరుగనున్న రెండో రౌండ్ టేబిల్ సమావేశం విఫల మవుతుందని తెలిసి కూడా దానికి హాజరు కావటానికి గాంధీ ఒప్పుకున్నాడు. ఈ సమావేశంలో కాంగ్రెసు ప్రతినిధి గాంధీ ఒక్కడే. గాంధీ దృక్పథం నుంచి ఈ సమావేశం పూర్తిగా విఫలమయింది.

1931 ఆఖరులో గాంధీ బొంబాయి తిరిగి రాగానే ఆయనను ఖైదు చేశారు. ఢిల్లీ ఒప్పందం బుట్ట దాఖలయింది. కాంగ్రెస్ సంస్థ నిషేధానికి గురి అయింది. కాంగ్రెసును అణచటానికి ప్రభుత్వం తయారు చేస్తున్న పథకాలను గురించి తెలియక పూర్వమే, "ఇదివరకు లాఠీలను ఎదుర్కొన్నాం, ఇక ముందు తుపాకులను ఎదుర్కోవలసి ఉంటుంది," అని గాంధీ చెప్పేశాడు. ప్రభుత్వం జాతీయోద్యమాన్ని అణచటానికి చాలా తీవ్రమైన చర్యలే తీసుకున్నది. ఈ చర్యలు ఫలించాయని కూడా ప్రభుత్వం అనుకున్నది.



ప్రభుత్వం ప్రత్యేక నియోజక వర్గాలను నూతన రాజ్యాంగంలో ఏర్పాటు చేయ తలపెట్టినట్టు తెలియగానే గాంధీ ఆమరణ నిరాహార దీక్ష ప్రకటించాడు. అస్పృశ్యులు శాశ్వతంగా అస్పృశ్యుల జాబితాలలో ఉండి పోవటం గాంధీకి భయంకరంగా తోచింది. సెప్టెంబరు 20 న ఆయన ఆమరణదీక్ష ఆరంభమయింది. దేశంలో ఆందోళన చెల రేగింది. అస్పృశ్యుల నాయకుడు అంబేద్కర్ ప్రత్యేక నియోజక వర్గాల పట్ల చాలా పట్టుదల కనబరిచాడు. చివరకు ఎలాగై తేనేం పూనా ఒప్పందం జరిగింది.

1933 మే 8న గాంధీ మరొక 21 రోజుల నిరశనం ఆరంభించాడు. ఆ రోజే ఆయనను జైలు నుంచి విడుదల చేశారు. ఆయన హరిజన సంక్షేమం కోసం కృషి చేయ సంకల్పించాడు. ఆయన సబర్మతీ ఆశ్రమాన్ని హరిజన సేవక సంఘానికి దత్తం చేసి, తన నివాసం వర్ధాకు మార్చాడు. పది నెలల లోపల హరిజన నిధి 8 లక్షలు పోగయింది.

అస్పృశ్యత హిందూ సమాజంలో చాలా లోతుగా పాతుకు పోయింది. దానికి వ్యతిరేకంగా గాంధీ పనిచెయ్యటం హిందువులకు ఆగ్రహం తెప్పించింది. 1933 జూను 25 న పూనాలో ఆయన మీద ఎవరో బాంబు విసిరి, ఏడుగురిని గాయపరిచారు. గాంధీకి గాయం తగల లేదు. 1934 మార్చిలో బీహారు భయంకరమైన భూకంపానికి గురి అయినప్పుడు, అస్పృశ్యత అనే పాపానికది శిక్ష అని గాంధీ అన్నాడు; అస్పృశ్యతకు వ్యతిరేకంగా ఆయన చేసే ప్రచారానికే అది శిక్ష అని మతోన్మాదు లన్నారు! ఏమైనా గాంధీ అస్పృశ్యతను తీవ్రంగా ద్వేషించాడు. ఆయన కృషి పూర్తిగా ఫలితానికి రాకపోయినా, ఈ దురాచారం క్రమంగా అంతరించడానికి అవసరమైన ప్రాతిపదిక ఏర్పడింది.



# 99. పాలోమార్ అబ్జర్వేటరీ

అమెరికాలోని పాలోమార్ పర్వతం పైన ప్రపంచంలో కెల్లా పెద్ద ప్రతిఫలకం (200 అంగుళాలది) గల దూర దర్శిని ఉన్నది. అది ఉండే కట్టడం (ఎత్తు 135 అడుగులు) ముందు భాగంలో చూడ వచ్చు. ఇది ఆకాశంలోకి నూరుకోట్ల కాంతి సంవత్సరాల దూరం "చూడ" గలదు. మనిషి కన్ను చూడగల అత్యంత హీనకాంతి గల నక్షత్రం కంటె 40 లక్షల రెట్లు హీనకాంతి గల నక్షత్రాలను ఇది చూపుతుంది. కుడిపక్కన దూరంగా కనిపించే తెల్లని కట్టడంలో "బిగ్‌ష్మిట్" టెలిస్కోపు ఉన్నది. దీని సహాయంతో ఆకాశంలో చాలాభాగం ఫోటోలు తీసి ప్రచురించారు.



 Photo by D. N. Shirke



బహుమతి
పొందిన వ్యాఖ్య

కలిగి ఖర్మం

పంపినవారు:
ఇ. వి. భారతి, చౌటపాలెం.

Photo by Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

లేక దరిద్రం

పంపినవారు:
ఇ. వి. భారతి, చౌటపాలెం.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఏంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కలిగి ఖర్మం

రెండవ ఫోటో: లేక దరిద్రం

పంపినవారు: కుమారి అప్పగుంట విజయభారతి.

చౌటపాలెం. (నెల్లూరు జిల్లా)

బహుమతి మొత్తం రు 20 —ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

**Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road. Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

# ఫోస్ఫోమిన్



శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.

సహనశక్తిని హెచ్చించును.



శరీరముయొక్క

రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్ వల్ల ఆరోగ్యము కలుఁగును.

ఫోస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్ గ్లిసరోఫోస్ఫేట్లుగల అకుపచ్చని పండ్ల రుచిగల టానిక్




SQUIBB

SARABHAI CHEMICALS

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం: దీని లైసెన్సు ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

Shilpi SC 50 A /67 Tel

